## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2030020024773

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కల్యాణ కాదంబరి

బాణమహాకవి కృతికి భావానుకృతి

"ఉభయభాషాప్రవీణ"

జంధ్యాల పాపయ్యశాస్త్రి



ప్రకాశకులు

జనరల్ పబ్లిషర్సు గుంటూరు

# పరిచయము

ఈ కృతి బాణమహాకవి కృతికి భావానుకృతి.
బాణుఁడు సంస్కృత సాహిత్యాచార్యుఁడు.

ఈయన కావ్యములు రసజ్ఞమండలి హృదయ
ములలో ప్రత్యేకస్థానము సంపాదించుకొన్నవి.

బాణుఁడు ఆఱవ శతాబ్దమున భారతావనిని
పాలించిన హర్షవర్ధనుని యాస్థానకవి.

ఈ కవి కాదంబరి అమరభారతి చేతి రమణీయ
రత్న విపంచి - కావ్యశ్రీకి కమనీయ కాంచి.

పండితలోకములో దీని కఖండఖ్యాతి గలదు.
"బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అని యుభియుక్తోక్తి.

ఇందు నిబద్ధమైన కాదంబరీ మహాశ్వేతల
చరిత్రము పవిత్రము. హృదయంగమము.

ఇందలి వర్ణనము లుదాత్తములు. సంభాషణ ములు సముజ్జ్వలములు. శైలి గంగాతరంగిణి. కథాకల్పన మత్యద్భుతము.

కాదంబరి మహాకావ్యము. దీనిని వీలైనంత సులభశైలిలో తెనిఁగించి విద్యార్థుల కందీయ సంకల్పించితిని. ఆ ప్రయత్న ఫలితమే ఈ "కల్యాణ కాదంబరి."

రచయిత

# కల్యాణ కాదంబరి

## ప్రథమ విలాసము

శ్రీమంతమగు విదిశానగరమును రాజధానిగాఁ జేసికొని శూద్రకుఁడను మహారాజు మాళవదేశమును బాలించుచుండెను. ఆ మహీపతి యఖిలసంపదలకు నాలవాలమై, నిఖిల విద్యలకు నిలయమై, రాజనీతి కలంకరణమై, రసజ్ఞత కుదాహరణమై, బుద్ధియందు బృహస్పతిని, భోగములయందు దివస్పతిని, సౌందర్యమున రతిపతిని, సౌభాగ్యమున రమాపతిని మించి ప్రకాశించెను.

ఆ మహీనేత యొకనాఁటి ప్రాతఃకాలమున బంధుమిత్ర పరివృతుఁడై, సమస్త సామంత పరివారసమేతుఁడై నిండుపేరోలగంబుండెను.

అప్పుడు ప్రతీహారి చనుదెంచి వినయ వినమ్రముఖియై ముకుళితకరకమలములతో "ప్రభూ! రత్నపంజరములో రామచిలుక నుంచుకొని దక్షిణాపథము నుండి చనుదెంచిన యొక మాతంగకుమారి ద్వారమున నిలఁబడి

యున్నది. విశేష విస్మయాస్పదమగు నీ విహంగ రత్నమును ప్రభువులవారి పాదసన్నిధికిఁ గొనివచ్చి రాజసందర్శనమునకై నిరీక్షించు చున్నానని విన్నవించుకొను చున్నది." అని పల్కి యూరకున్నది.

కుతూహల జనకము లగు ప్రతీహారి వాక్యము లాకర్ణించి శూద్రకమహారాజు సభామందిరము నందలి సామంత మండలేశ్వరుల యాననము లవలోకించుచు "ఇందు దోషమేమున్నది. వెంటనే ప్రవేశపెట్టుము" అని యనుజ్ఞనొసఁగెను.

ప్రతీహారి రాజాజ్ఞ శిరసావహించి మాతంగకుమారిని కొలువుకూటములోనికిఁ గొనివచ్చినది. మాతంగకన్యయు మహారాజున కల్లంత దూరమున నిలువఁబడి హెచ్చరిక కొఱకు తన చేతిలో నున్న వేత్రదండముతో సభాకుట్టిమమును గట్టిగా మ్రోగించినది.

ఆ శబ్దము వినఁబడినంతనే సభాసదుల వీక్షణము లన్నియు నొక్కమాఱు మహారాజు ముఖమండలము నుండి మాతంగకుమారి వదనబింబముపై వ్రాలినవి.

మాతంగకుమారి చీలమండల వఱకు వ్రేలాడు నీల వర్ణకంచుకమును ధరించి యెఱ్ఱని మేలిముసుఁగు నొయ్యారముగఁ గప్పుకొని యుండెను. కంఠము సందు కమనీయ

ముక్తాహారములు కాంతులీనుచుండెను. నయనములు నవ నవోత్ఫుల్లము లగు నరవిందముల యందమును పుణికి పుచ్చుకొను చుండెను. నిద్దంపు నీలిముంగురులు ఫాలఫల కమునఁ బారాడు చుండెను. శ్రవణావతంసముగ సంత రించిన చందనపల్లవము లందములనాలిఁగించుచుండెను.

మనోహరమగు తనూలావణ్యమునకు సాక్షాత్కరిం చిన జగన్మోహిని వలె నున్న యా యన్నులమిన్నను శూద్రకరాజేంద్రుఁ డనిమిషలోచనుఁడై యవలోకించి విరించి సృష్టినైపుణ్యమునకు విస్మయ మందెను. అంతలో శ్రవణావతంస మించుక జాఱ, సవిలాసముగ వసుమతీ వల్లభునకు వందనమొనర్చి మాతంగకుమారి మణికుట్టి మముపై నుపవిష్టురాలయ్యెను.

ఆమె వెంట వచ్చిన వృద్ధమాతంగు డొకింత ముందున కరుదెంచి రత్నపంజరము నందలి రామచిలుకను రాజేం ద్రునకుఁజూపి "దొరా! ఇది చాల చిత్రమైన చిలుక. వైశంపాయనమను నామధేయముగలది. సకల శాస్త్ర ములు దీనికిఁ గరతలామలకములు. అఱువదియారు కళల యందాఱితేఱినది. పరిహాస సంభాషణములఁ బాండి త్యము గడించినది. నీతికథలకు నిధి. సుభాషితములకుఁ బెట్టినది పేరు. సంగీతమున నందెవేసిన చేయి. సాహిత్య మున సాటిలేనిమేటి. సమస్త రత్నములకు రత్నాకరుని

చందమున నీ శుకరత్నమును స్వీకరింప దేవరవారే యోగ్యులని నిశ్చయించి మా మాతంగరాజకుమారి దీనిని ప్రభువుల పాదసన్నిధికిఁ గొనివచ్చినది. ఏలిన వారీ బహుమానమును పరిగ్రహించి మమ్మనుగ్రహింప వేఁడు కొనుచున్నాను” అని శుకపంజరమును శూద్రక భూపాలుని ముందు పెట్టి వెనుక కేగి నిలుచుండెను.

వెంటనే యా విచిత్ర విహంగము మహారాజున కభిముఖమై నిలబడి దక్షిణ చరణము పైకెత్తి జయశబ్దము నుచ్చరించి సుందరము, సుమధురము, సుస్పష్టము నగు స్వరముతో నా యుర్వీపతి నుద్దేశించి హృద్యమగు నొక పద్యమును పఠించినది.

సార్వభౌముఁ డా పద్యమును విని సంభ్రమాశ్చర్య భరితుఁడై సమీపమందున్న కుమారపాలితుఁ డను నమాత్యశేఖరు నవలోకించి “ఆర్యా! ఈ వింత శకుంత మెంత విస్పష్టముగాఁ బద్యమును బఠించినది. ఇందలి యసంకీర్ణమగు వర్ణోచ్చారణమును సహజమగు స్వర మాధుర్యమును గుర్తించితిరి గదా! ఈ కీరమునకుఁ గల సంస్కారమును సమయోచిత ప్రవృత్తియు నచ్చెరువు గొల్పుచున్నవి. దీనిసాహితీసంపద శ్లాఘనీయము. దక్షిణ పాదము పైకెత్తి, జయశబ్దము నుచ్చరించి మఱి పద్యము పఠించినది. పక్షులకును, పశువులకును, భయాహార

నిద్రాదులు పూర్తిగనే తెలియునని వింటిమి. ఈ శుక వృత్తాంతము చోద్యముగ నున్నది”అని పలికెను.

కుమారపాలితుఁడును మందహాసముతో మహారాజు నవలోకించి యిట్లు వచించెను. “రాజేంద్రా! ఇందాశ్చర్య మేమున్నది? శుకశారికాది శకుంతములు కొన్ని విన్న పలుకులనే పునరుక్తములు గావించు నను విషయము దేవరవా రెఱుంగుదురు. పురుష ప్రయత్నముచేఁ గాని, పూర్వజన్మ సంస్కారముచేఁ గాని విహంగములకు సైత మిట్టి విజ్ఞాన విశేషములు ప్రాప్తించుట విచిత్ర విషయము కాదు. పురాణ కాలమున మనుష్యులకు వలెనే శుకములకు సైతము పరిస్ఫుటమైన వాక్కు కలిగియుండెడిదఁట. అనంతర మగ్నిదేవుని శాపమువలన శుకముల కస్ఫుటాలాపమును, కుంజరములకు జిహ్వాపరివర్తనమును ప్రాప్తించిన వని పండితులు పలుకుదురు.”

సుమంత్రి యిట్లు వచించుచున్నంతలో మధ్యాహ్న శంఖధ్వనులు వినవచ్చినవి. అంత శూద్రక మహీరాజు స్నానసమయము సమాసన్న మగుటచే సభ చాలించి సామంతరాజలోకమును వీడ్కొలిపి, మాతంగ కుమారిని విశ్రమింపుమని ముదలయిడి, శుకరత్నమును శుద్ధాంతము లోనికిఁ గొని పొమ్మని తాంబూల కరండ

వాహిని కనుజ్ఞనొసఁగి కతిపయపరివార పరివృతుండై యభ్యంతర మందిరమును బ్రవేశించెను.

అనంతర మమ్మహారాజు సుశీతలములు, సుగంధ బంధురములు నగు జలములతో స్నానకృత్యము నిర్వర్తించి పాముకుబుసము వంటి మేలిదువ్వలువలు ధరించి, మంత్రపూతములగు నుదకములతో సహస్రారున కర్ఘ్య మొసఁగి, దేవగృహమును బ్రవేశించి, మహాదేవు నారాధించి యగ్నికార్యములు దీర్చి, మృగమద చందనాను లేపము నందుకొని, మాలతీకుసుమ మాలికలు గైసేసి, ప్రేమభాజనులగు రాజకుమారులతోఁ గలిసి భోజన మొనరించెను.

అనంతరము కర్పూర తాంబూలము సేవించుచు పర్యంకమ్మపై విశ్రమించిన శూద్రకమహారాజు కుతూహలముతోఁ బ్రతీహారిం గాంచి యంతఃపురము నుండి "వైశంపాయనము"ను గొని రమ్మని యాజ్ఞాపించెను.

ప్రతీహారి "చిత్త" మని ప్రభువునకుఁ బ్రణామము లొనర్చి ముహూర్త మాత్రములో మహారాజు సన్నిధికి వైశంపాయన శుకమును దీసికొని వచ్చెను. శూద్రక భూపతియు శుకరత్నము నాలోకించి "యంతఃపురమున నభీష్టములగు వస్తువుల నారగించితివా? ఆహారము

రుచించినదా ?" అని ప్రశ్నింప వైశంపాయనము వసుమతీ వల్లభునితో నిట్లు వచించెను. "మహారాజా! అంతిపురియందు నే నారగింపని దేది కలదు? కమ్మని జంబూఫల రసమును కడుపునిండ గ్రోలితిని. సింహనఖములచేఁ జీల్పబడిన ఏనుగుల కుంభస్థలము లందలి రక్తరంజితములైన ముక్తాఫలముల వంటి దానిమ్మగింగింజల గంటువెట్టితిని. ద్రాక్షాఫలముల రుచిచూచితిని. ఆమలకముల నారగించితిని. ఇన్నియేల? రమణీయమూర్తులగు రాణుల పాణికముల సంస్పర్శనముచే నన్ని పదార్థములును నమృత మయములై ఆప్యాయనములుగ నున్నవి."

ఈ విధముగఁ బలుకు చిలుక నవలోకించి మహారాజు "వైశంపాయనా! నీ చరిత్ర మామూలాగ్ర మాలకించుటకై హృదయ ముర్విళ్లూరుచున్నది. నీ వేదేశమున జన్మించితివి నీకీ నామకరణ మొనర్చినవా రెవ్వరు? నిన్ను గన్న జననీజనకు లెచ్చట ? ఆమ్నాయముల నెచ్చోట నభ్యసించితివి ? శాస్త్రముల నెవ్వోడఁ జదివితివి? ఈ విద్యా భాగ్యము నీకు జన్మాంతర సంస్కారముచే ప్రాప్తించెనా ? వరప్రసాదముచే లభించెనా? లేక విహంగ వేషము ధరించి వచ్చిన విద్యాధరుఁడవా? పూర్వ మెచ్చట నుండువాఁడవు ? ఇప్పటి నీ వయః పరి

మాణ మెంత? పంజరబంధ మెట్లు ప్రాప్తించెను? మాతంగకుమారి కేరీతి వశమైతివి? ఇచ్చోటి కెట్లు వచ్చితివి? సమస్తమును సవిస్తరముగ వచింపుము" అనుటయు నొకింతకాల మేదో ధ్యానించి శుకరాజు మహారాజుతో నిట్లు పలికెను.



# ద్వితీయ విలాసము

మహీపాలా! ఇది చాల యద్భుతమైన కథ. విన వేడుక గలదేని మనవి చేయుచున్నా నాకర్ణింపుఁడు.

వింధ్యారణ్య మధ్యమున విశాలమైన దండకారణ్యము విరాజిల్లుచుండును. అందు గోదావరీ తీరమున నత్యంత పవిత్రమగు నగస్త్యాశ్రమ మలరారును. ఏ మునీంద్రుఁడు మహేంద్రాది దేవతానీకముచేఁ బ్రార్థింపఁబడి సమస్త సముద్రోదకము నొక్క గుక్కగా గ్రోలెనో, ఏ ఋషి చంద్రుఁడు మేరుపర్వతముమీఁది వైరముచే దినకర రథనిరోధముగావించిన వింధ్యశైలమును వినయ వినమితము చేసెనో, ఏ దయాసాంద్రుఁడు సాధుజనబాధాకరుఁడగు వాతాపిరాక్షసుని తన జఠరాగ్ని కింధన మొనర్చి లోకముల శోకము వాపెనో, ఏ తపస్వి శిరోమణి ఏకైక హుంకారరవము దురహంకార దూషితుఁడగు నహుషుని స్వర్గభ్రష్టుని సలిపెనో, ఆ యగస్త్య మహాముని మహత్వము వర్ణింప నెవ్వరికి సాధ్యమగును? ఆ తాపసోత్తముని యర్ధాంగ లక్ష్మి యగు లోపాముద్ర స్వయముగ పాదులు చేసి దోసిళ్లతో జలములు వోసి సుతనిర్విశేషముగా పెంచి

పెద్దచేసిన నానావిధ మహీరుహములతో నొప్పు నయ్యా శ్రమ మనన్యాదృశమై విరాజిల్లును. పితృవాక్య పరిపాలనమునకై శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులతో నరుదెంచి కొంతకాల మచ్చటనే పంచవటి యందలి పర్ణశాలలో గాపురముండెను. అలనాడు జనకరాజకుమారి సానురాగములగు పాణిపల్లవములతో దూర్వాంకురములు దినిపించి పెంచిన కురంగము లీనాటికిని వర్షాకాలమున కాలమేఘముల గంభీరగర్జారావము లాలకించి నంతనే దశరథనందనుని ధనుష్టంకారములు దలంచుకొని చంచలములగు నేత్రాంచలముల బాష్పబిందువు లొలికించుచు దశదిశలు బరికించుచు లేబచ్చికలు స్పృశింపవు.

మహామహిమాన్వితమగు నయ్యగస్త్యాశ్రమమున కల్లంతదూరమున ప్రఫుల్లములగు నుత్పలముల తోడను సుగంధ బంధురములగు సౌగంధికముల తోడను, మకరందబిందునిష్యందములగు నరవిందములతోడనునిండి కలహంసబృందముల విహారములకును, చక్రవాక మిథునముల సంచారములకును, మధుకరకులముల మంజుల గానములకును స్థానమై, యనుపమానమై, పంపాభిధానమైన పద్మాకర మొండు ప్రకాశించుచుండును.

ఆ సరోవరమునకు పడమటి పార్శ్వమున వింధ్యగిరికి వేడుక చెలికాని వలె దండకారణ్యమున కంతటికి దండనాయకుని వలె, నఖిల వనస్పతులకు నధిపతివలె మహోన్నతమై సువిశాలమై యొక శాల్మలీవృక్షము వెలయుచుండును.

దురారోహ మగు నా ధరారుహము కొమ్మల యందును, కోటరముల యందును నానాదిక్కులనుండి వచ్చిన శుకకుటుంబములు నీడంబులు నిర్మించుకొని నిర్భయముగ నివసించుచుండును. ఇట్లసంఖ్యాకములగు కీరము లాబూరుగు మ్రానిపైఁ గాపురముండి ప్రతిదినమును ప్రత్యూషముననే లేచి యాహారార్థ మాకసమున బారులు దీర్చి పోయి యచ్చటచ్చట లభించినవానిఁదిని కులాయముల లోని పసికందులకు పలువిధములగు ఫలరసములను, పంటకంకులను చంచూపుటముల నిఱికించుకొని వచ్చి తినిపించుచు తమప్రియ సంతానముల నంటిపెట్టుకొని రాత్రులు గడుపుచుండును.

అందొక కోటరమున సతీసమేతముగ నివసించు నా జనకునకు నే నొక్కఁడనే కుమారుఁడను జన్మించితిని. దురదృష్టవంతుఁడ నగు నేను జన్మించుచుండఁగనే నా జనని ప్రసవబాధ భరింపఁజాలక పరలోక గతురాలై నది. ముసలితనమున సంప్రాప్తమైన ప్రియావియో

గముచే నత్యంతశోకాక్రాంతుఁ డయ్యెను. నాతండ్రి యెట్టెట్లో దుఃఖమును దిగమ్రింగి నన్ను పెంచుటలో నిమగ్నుఁ డయ్యెను. పండుముదుసలి యగుటచే పరిభ్రమించు శక్తి చాలక పరపక్షి కులాయముల నుండి నేలరాలిన ఫలశకలములను బియ్యపుగింజలను మెల్ల మెల్లఁగ నేఱికొని వచ్చి నాకిచ్చి నేను భుజించిన యనంతరము శేషించినదానితోఁ దాను కడుపునింపుకొని జీవయాత్ర సాగించుచుండెడివాఁడు.

ఒకనాఁడు తెల్లవారి బారెడు ప్రొద్దెక్కెను. ఆ సమయమున కాంతారమందలి సకల జంతు సంతానములకు సంతాపకారణమై మృగయా కోలాహలము శ్రవణ గోచరమయ్యెను. అతి భయంకరము, నశ్రుతపూర్వము నగు నా ధ్వని నా చెవులు బ్రద్దలు సేసినది. నేను భయ విహ్వలుఁడనై గడగడ వడంకుచు సమీపవర్తి యగు జనకుని ఱెక్కల చాటున నక్కితిని.

అనంతర మా కాంతారమంతయు నిట్టి భయానక శబ్దములతో నిండిపోయెను. "ఓరీ! అదిగో తామరపూల పరిమళము – మదగజములు మథించుచున్నవి కాఁబోలు! అల్లదే తుంగముస్తల సుగంధము – వనవరాహములు త్రవ్వుచున్నవి కాఁబోలు! అదిగదిగో! యాకసమున నెఱ్ఱనిదుమారము–అడవిదున్నలు వల్మీకములను కొమ్ము

లతో గ్రుమ్మ్రుచున్నవి కాంబోలు! అల్లదిగో జింకల మంద! అదిగో మయూరమండలి! ఈ వృక్ష మారోహింపుడు! ఆ దిక్కు దర్శింపుడు! ఈ శబ్దము నాకర్ణింపుడు! చాపముల నందుకొనుడు! జాగరూకులై నిలబడుడు! జాగిలముల నుసికొల్పుడు!" అను నాటవికుల కోలాహలము నాలకించితిని.

అంతఁగొంతసేపటికి శరతాడితములైన కంఠీరవముల గర్జనములతో, భయభ్రాంతములైన దంతావళముల ఘీంకారములతో, మరణోన్ముఖములైన హరిణముల కరుణాస్వరములతో, తరుశిఖరముల కెగురు పక్షిబృందముల ఱెక్కలమ్రోతలతో, నాయరణ్యభాగమంతయును నల్లకల్లోల మయ్యెను.

అంత మఱికొంత కాలమునకు కోలాహల ముపశమించి మథనానంతరము ప్రశాంతమైన పయోనిధివలె, వర్షించి వెలసిన వారిదబృందమువలె, నయ్యరణ్యము స్తిమిత మయ్యెను. నేనును బాల్యచాపల్యము ప్రేరేప భీతి దక్కి కౌతుకాయత్త చిత్తముతో 'నిదియేమో?' యని తండ్రి ఱెక్కలసందున నక్కియే యాదిక్కునకు నిక్కి చూచితిని.

అంత ధరణీతలమునకు దిగివచ్చిన దండధరకింకర నికరమువలె, పాతాళము భేదించుకొని బయలువడిన రక్కసిమూకవలె, సింగినుండి వ్రాలిన కాల మేఘ శకల సమూహమువలె, ఏకత్ర సమాగతమైన పురాతన పాపకర్మ పుంజము వలె, మడువునుండి వెడలిన యడవి దున్నల దండువలె, కానన మంతయు గాఢాంధకారము నింపుచు నత్యంత భయంకరమై యసంఖ్యాకమై యున్న కిరాతసేనానీకమును సందర్శించితిని.

ఆ మహాసైన్య మధ్య భాగమున నవయౌవన విరాజితుండై జన్మాంతర మందిన ఏకలవ్యుండో, వింధ్యపర్వతము పెంపుడు బిడ్డడో, యమధర్మరాజు నవతారమో కలిపురుషుని కాంతిసారమో యన నొప్పెడు "మాతంగుం" డను శబరచమూపతిని గనుంగొని భయాకులహృదయమునతో నే నేనేమియో దలపోయు నంతలో నాసేనాపతి యాశాల్మలీవృక్షముక్రిందకు వచ్చి, శ్రమదీర్చుకొనుటకై పరిజన పరికల్పితమగు పల్లవశయ్యపై నుపవిష్టుండయ్యెను.

అంతలో మఱియొక సైనికుండు సత్వర గమనమున సరోవరములోం బ్రవేశించి పట్టెడు పద్మనాళములను బట్టుకొని వచ్చి సేనాపతికిం గానుక వెట్టెను చమూపతియు చంద్ర కళలను దిను రాహువు వలె నామృణాళ నాళములను భుజించి, చల్లని జలములం గ్రోలి, కొంతతడ

వచ్చట విశ్రమించెను. అనంతర మపగతశ్రముఁడై సమస్తచమూసమేతముగ వేఁటకొక దెసకు వెడలిపోయెను.

కిరాతు లందఱు వెడలిపోయిరి. కాని యొక వృద్ధ కిరాతుఁడు మాత్రము తనకుఁ గావలసిన మాంసము లభింపమింజేసి వెనుకఁ జిక్కి యా తరుమూలమునందే తారాడుచుండెను. తనవా రందఱు తరలిపోవుట చూచి యాజరఠశబరుఁడు కుటిల భ్రుకుటితో, క్రూరవీక్షణములతో మాయాయువులు గ్రోలువానివలె నాయవనీరుహము నామూలాగ్ర మాలోకించెను. ఆ దుష్టుని దృష్టిపాతములచే గూండ్లయందలి శుకకుటుంబములకు పై ప్రాణములు పైనలేచి పోయెను.

నిష్కరుణహృదయులగు ఘాతుకులకు దుష్కరకృత్య మేమున్నది? ఆ దురాత్ముఁ డయ్యవనీరుహము నతినైపుణ్యముగ నారోహించి, గూండ్లు పరికించి, కోటరములు గాలించి, శాఖల న్వేషించి, పసికూనలనక, ముసలి వగ్గులనక, పచ్చిబాలెంతలనక చేఁజిక్కిన చిలుకలఁ బట్టుకొని మెడనులిమి పుడమిపైఁ బడవైచెను. నిన్న మొన్న పుట్టిన వగుటచే నెత్తురు ముద్దలవలెఁ గన్పించునవియు, ఱెక్కలు రాకపోవుటచే క్రొందమ్మి మొగ్గలవలె నొప్పున్నవియు, నప్పు డప్పుడే కొంచె మొడలు చేసి జిల్లేడు

కాయలవలెఁ గానవచ్చునవియు నగు శుకశాబకము
లను బూరుగు పిందెలవలె నేలపై దూసి పోసెను.

ఆ కిరాతహాతకుఁడు సమీపించుచుండ మదీయ జనకుఁడు కంపమాన గాత్రముతో నేత్రముల బాష్పబిందువుల నించుచు నితికర్తవ్యతా మూఢుఁడై, యా యపాయ సమయమున మఱియొక యుపాయము దోఁచక నన్ను తన పక్షముల చాటున భద్రముగ దాచి యుంచెను. వాఁడు మెల్ల మెల్లఁగ మేమున్న కోటరమును జేరి పాముపడగవలె భయంకరమైన వామహస్తము చాచి, మాటిమాటికి నోటితో గొఱకుచు గొంతెత్తి యఱచుచున్న నాతండ్రినిఁ బట్టుకొని మట్టుపెట్టెను. ఆయుర్దాయము శేషించి యుండుట వలనను, అత్యల్ప శరీరుఁడ నగుట వలనను, భయముచే ముడుచుకొని ముద్దయై తండ్రి ఱెక్కల సందున నక్కియున్న నే నా రక్కసుని కంటఁబడలేదు.

ఆ పాపాత్ముఁ డపగతప్రాణుఁడైన నా జనకు నధోముఖముగఁ గ్రిందఁబడవైచెను. తండ్రి రొమ్ములోఁ దల దూర్చుకొనియున్న నేనును తండ్రితోఁబాటుగనే ధరణీతలముపైఁ బడితిని. కాని నా యాయుర్దాయము గట్టిది. కన్నులు విప్పి చూతును గదా సుడిగాలికిఁ గుప్పవడి

యున్న యెండుటాకుల కుప్పపైఁ బడియుంటిని. ఆ కారణమున నా శరీర మే మాత్రమును చెక్కు చెదర లేదు.

ఆ దుర్మార్గుఁ డా యవనీరుహము నవరోహించు నంతలో వాని కనుగప్పి కన్నతండ్రిని విసర్జించి, అప్పు డప్పుడే యంకురించుచున్న ఱెక్కలతో నటునిటు పొరలుచు సమీపమందలి తమాల తరుమూలమును జేరితిని.

అనంతర మాకిరాతుఁడు వృక్షమునుండి దిగి గతాసువులై క్షితితలమున పఱచినట్లు పడియున్న పక్షిసమూహములను పర్ణపుటముల నుంచి లతాపాశములతో బంధించి శబరసైన్యముచనిన మార్గముననే చకచక సాగి పోయెను. వాఁడు చనిన యనంతరము పితృమరణదుఃఖితుఁడనగు నాకు మిక్కుటముగ దాహమయ్యెను. పిపాసా పీడితుఁడనగు నేను కొంచెము కొంచెము మెడ నెత్తి చంచల నయనాంచలములతో దిశలవలోకించుచు, చీమ చిటుక్కుమన్న వాఁడు మరల వచ్చుచున్నాఁడని యులికి పడుచు, ప్రాణము లఱచేతఁ బెట్టుకొని యాతమాల మూలమునుండి సలిల సమీపమున కరుగఁ బ్రయత్నించితిని. ఱెక్కలు సరిగ రాకుండుట చేతను పట్టుమని పది యడుగులైన పెట్టలేకుండుట చేతను మాటిమాటికి ముందుకుఁ బడుచు మరల లేచుచు నాయాసముతో నిట్టూర్పులు నిగుడ్చుచుంటిని.

# తృతీయ విలాసము

అచ్చోటి కనతిదూరముననే జాబాలి మహాముని యాశ్రమ మున్నది. అందుండి ఆయన కుమారుడగు హారీతుఁడు సమవయస్కులగు నాయుమి కుమారులతో సరోవరమున స్నానము చేయుటకై యా మార్గముననే యచ్చోటికి వచ్చెను. మహాత్ముల మానసము లకారణ మిత్రములు, అతి కరుణార్ద్రములు. ఆ హారీతముని కుమారుఁడు దుర్దశలో దురపిల్లుచున్న నన్నుఁగని దయార్ద్రహృదయుఁడై సమీపమందున్న ఋషికుమారునితో నిట్లు పలికెను. "మిత్రుడా! ఈ శుకశాబకము నవలోకింపుము. పాపము దీని కింకను సరిగ ఱెక్కలు రాలేదు. వృక్షాగ్రమునుండి పుడమిపైఁ బడియుండ వచ్చును. లేదా డేగనోటినుండియైన క్రిందఁబడియుండ వచ్చును. అంతయెత్తునుండి పడుటచే చాలదెబ్బ తగిలి యుండును. మాటిమాటికి నయనములు మూయుచున్నది. సారె సారెకు బోరగిల బడుచున్నది. ఎడనెడ వేడి నిట్టూర్పులు విడుచుచున్నది. ఉండియుండి నోరు తెఱచు చున్నది. మెడ నిలుపలేకపోవుచున్నది. ప్రాణము కడ బట్టకముందే ఈ యనాథకీరమును సరస్తీరమునకుఁ గొని పోయి సంరక్షించుదము."

అని వచించి హారీతుఁడు నన్నుఁ గొలనిచెంతకుఁ గొని పోయి దండ కమండలువుల నొక్కప్రక్కనుంచి సలిల సమీపమున నుపవిష్టుఁడై యప్రయత్నముగఁ దెఱచిన నానోటియందు స్వీయకరముతోఁ గొన్ని తోయ బిందువులు వదలెను. చల్లని జలములు శరీరముపైఁ జల్లి సేద తీర్చెను. అనంతర మల్లనల్లన ప్రాణములు తెప్పరిల్లి నయనములు విప్పి నలుదెసలు పరికించుచున్న నన్నా మునికుమారుఁడు సరోవరతీరమున నొక సరోజపత్రము నీడలో నెండ తగులకుండ నుంచి స్నానమొనర్చి ప్రాణాయామము సలిపి సూర్యభగవానున కర్ఘ్యమొసగి ధౌతవల్కలములు ధరించెను. తరువాత నన్ను కరమున గ్రహించి తాపస కుమారులతోఁగూడి తపోవనోన్ముఖుఁడయ్యెను.

అంతఁ గొంతసేపటికి నేము జాబాలి మహర్షి తపోవనమును బ్రవేశించితిమి. ఆ యాశ్రమము ధర్మశాస్త్రములు చర్చించు వారితోడను, హరిహర పితామహుల నర్చించువారితోడను, పత్రఫలపుష్పసమిత్కుశాదులు గొనివచ్చు వారితోడను, జపమాలలు గ్రుచ్చువారితోడను, యోగవిద్యలు నేర్చువారితోడను, హోమకార్యములు దీర్చువారితోడను, నారబట్టల నారఁబట్టువారితోడను, శ్రుతిస్మృతుల నేకరువుబెట్టువారితోడను,

గూడియుండి యసత్యమున కంటరానిదై, కలిపురుషు నకుఁ గాంచరానిదై, రెండవ సత్యలోకము కైవడి నలరారుచుండెను.

ఆ మహాశ్రమములో నొక యశోకవృక్షము క్రింద, కుల పర్వతముల నడుమ మేరుపర్వతము చందమున మహర్షి మండల మధ్యమున జాబాలి మునీంద్రుఁడు విరాజిల్లు చుండెను. శరచ్చంద్ర ధవళమగు జటాజూటముతోడను, బ్రహ్మతేజోవిరాజితమగు ఫాలఫలకముతోడను, ప్రశాంతములగు విశాలనేత్రములతోడను ప్రకాశించు న మ్మహాత్ముని నవలోకించి నాలో నేనిట్లు తలంచితిని.

"ఏమీ ఈ బ్రహ్మర్షి తపఃప్రభావము. ఈ తాపసేంద్రుని రూపము పరమశాంతమయ్యును సౌదామినీలత వలె దేదీప్యమానమై కనులకు మిఱుమిట్లు గొలుపు చున్నది. దివ్యప్రభావ సంపన్నుఁడగు నీఋషిసత్తము నకు త్రిలోకములు త్రికాలములు కరతలామలకములు. సంయమీంద్రుల నామగ్రహణ మాత్రముననే సమస్త కలుషసమూహములు నమసిపోవునన్న నికవారి సందర్శన మెంత ఫలప్రదమో వేఱుగఁ జెప్పవలెనా ? ఈ ముని సార్వభౌమాధిపత్యము వలన నీ తపోవనము పావన మైనది. తపోవనము మాత్రమే కాదు. ఈఋషిపుంగవుని

సాంగత్యముచే ప్రపంచమే పరమధన్యమైనది. ఈ మహానుభావుని సమ్ముఖమున సమాసీనులై యహర్నిశము పుణ్యకథ లాకర్ణించు జడదారు లెంత యదృష్టవంతులో! ఈతపస్వి తల్లజుఁడు దయారసమునకుఁ బ్రవాహము. క్షమాగుణమున కాధారము. సత్యమున కాయతనము. సత్త్వగుణమున కాలయము. సాధుత్వమునకు జన్మభూమి. సమస్తవిద్యలకుఁ స్థిరస్థానము. సంసారసముద్రమునకు సంతరణ సేతువు. సత్పథమునకు సందర్శకుఁడు. మోహాంధకారమునకు ప్రభాకరుఁడు. ఇచ్చట మచ్చరమునకుఁ దావులేదు. పరాభవమునకుఁ జోటులేదు. అభిమానమునకు స్థానములేదు. ఆగ్రహమున కవకాశములేదు. ఈ మహామహుని మహత్త్వమున నీయాశ్రమమంతయు నుపశాంతవైరమై యొప్పుచున్నది. జంతువులు స్వభావసిద్ధమగు శత్రుత్వము మఱచి పరస్పర స్నేహమున సంతోష మనుభవించుచున్నవి. అదిగో! అచ్చట హరిణపోతము సింహశాబకములతోఁ గలిసి యాడుకొనుచున్నది. ఇదిగో! ఇచ్చట నెండవేడిమికి సహింపఁజాలని భుజంగము నెమలిపింఛము నీడలో బడలిక బాపుకొనుచున్నది. అల్లదిగో! ఆప్రక్క వానరములు స్నానము చేసి వచ్చిన సంయమి బాలకులకు ఫలకుసుమము లందిచ్చుచున్నవి."

ఈ విధముగ నేను వితర్కించుచున్నంతలో హారీతుఁడు నన్నాయశోక వృక్షచ్ఛాయ నొక్కచో నుంచి పితృదేవుని చరణారవిందములకు నభివందన మాచరించి సమీపమందలి కుశాసనముపై సమాసీనుఁడయ్యెను.

అచ్చట నుపవిష్టులైయున్న తపోధనులు నావంకజూచి యాశ్చర్యముతో "దీని నెక్కడనుండి గొని తెచ్చితి"వని హారీతుని బ్రశ్నించిరి. అతఁడును వారల నాలోకించి "మేమీ రోజు పంపాసరోవరమునకు స్నానార్థము చనుచుండ నీ శుకపోతము కాన్పించినది. ఎండ వేడిమికి పుడమింబడి దీనదృక్కులతో దిశ లవలోకించు దీనిపై జాలిగొని యిచ్చటికిఁ గొని తెచ్చితిమి. ఇది ఱెక్కలు వచ్చి యంతరిక్షమున నెగుర గలుగు నందాక మన యాశ్రమ మందే యొక తరుకోటరమున నుంచి పెంచుదము. అస్మాదృశుల కనాథపరిపాలన మే పరమ ధర్మము కదా!" అని పలుకుచున్న కుమారుని పలుకు లాకర్ణించి జాబాలి మహర్షి పరమ పవిత్రములగు ప్రశాంత వీక్షణములతో నన్ను మరల మరల వీక్షించి "ఈ శుకశాబకము తన యవిధేయతకు తగిన ఫల మనుభవించుచున్నది. అనిపల్కెను."

దివ్యదృష్టిచే భూత భవిష్యద్వర్తమానము లెఱుంగఁగల యామహర్షి పుంగవుని మహాత్వము తెలిసినవారగు

టచే మునులందఱు శుకకథాశ్రవణ కుతూహలముతో జాబాలి మహాముని గనుంగొని "స్వామీ! ఈకీరపోత మాచరించిన యవినయ మెట్టిది? ఎప్పుడాచరించినది? ఎందులకుఁ జేసినది? దీని పూర్వజన్మ వృత్తాంతమేమి? శుకజన్మ మెట్లు సంప్రాప్తించెను? దీనినామ మెయ్యది? మమ్మనుగ్రహింపుఁడు. మాకౌతూహలము దీర్పుఁడు. యుష్మాదృశుల ప్రభావము లత్యద్భుతములు - అవాఙ్మానసగోచరములు - అనన్యసామాన్యములు" అని ప్రాంజలులై ప్రార్థించిరి.

జాబాలిమునీంద్రుఁడు మునిమండలి ప్రార్థనమాలించి "దీని చరిత్రము చాల విచిత్రము. సుందరము. సుదీర్ఘము. అనుష్ఠానసమయ మాసన్న మగుచున్నది. అందుచే నిది యదనుకాదు. రాత్రి భోజనానంతరము సావకాశముగ సవిస్తరముగ దీనివృత్తాంత మంతయు మీకుఁ దెల్పెదను. ప్రస్తుతము ఫలాహారాదులచే దీని బడలిక బాపుఁడు. ఈ శుకశాబకము నాచే వర్ణితంబగు తనజన్మాంతరోదంతమును స్వప్నవృత్తాంతము మాడ్కి సంస్మరింపఁగలదు." అని పల్కెను.

అనంతర మామునిపుంగవు లందఱు లేచి తమతమ నిత్యానుష్ఠానముల నిర్వహించుకొనుటలో నిమగ్నులైరి.

సాయంకాల మయ్యెను. అంతరిక్షమం దరుణకాంతులు వ్యాపించెను. అహస్కరుడ స్తంగతుఁడయ్యెను. సంయమీంద్రుల స్వాంతములం దప్ప జగమంతయు తమస్సులు నిండిపోయెను. అంత మెల్ల మెల్లగా సుధాకరుఁ డుదయించి చల్లని వెన్నెలకెరటములతో ముల్లోకములను ముంచెత్తెను. అంతలో హారీతుఁడు మునిజనములతో వచ్చి సముచితాహారముచే సంతృప్తుఁడనైన నన్ను ముందుంచుకొని తన జనకుఁడైన జాబాలితో "తండ్రీ! సకల తపోధనులు చనుదెంచి యున్నారు. వీరందఱు విచిత్రమగు నీశుక చరిత్రము విన వేడుక పడుచున్నారు" అని విన్నవించుకొనెను.

ఇట్లు హారీతునిచేఁ బ్రార్థితుఁడై జాబాలిమహర్షి కన్నెదుటనున్న నన్నొకసారి వీక్షించి శ్రవణకుతూహలులై యున్న జడదారుల నుపలక్షించి, శుక కథాకథనమున కుపక్రమించెను.



# చతుర్థ విలాసము

మునులారా! ఇది చాల చక్కనికథ. ఏకాగ్ర హృదయములతో నాకర్ణింపుడు.

అతిప్రసిద్ధమైన యవంతి దేశమున "ఉజ్జయిని" యను నగరరాజము విరాజిల్లు చుండును. ఆ నగరము గగన చుంబితములగు సౌధములతోడను, వివిధ తరులతావిల సితము లగు నుద్యానముల తోడను, సంఫుల్ల కువలయార విందములగు సరోవరముల తోడను, అనర్ఘ మణి మండిత ములగు విపణివీధులతోడను రెండవ స్వర్గ ఖండమువలె నొప్పుచుండును.

సమస్త భువనములకు సర్గస్థితిసంహార కర్తయగు భవానీ భర్త కైలాసమందలి మమకారము విడిచి "మహాకాల" నామముతో నాపట్టణమున భక్తులకు పెన్నిధియై సన్నిధి చేసి యుండును. ఆ నగరరాజమును "తారాపీడుఁ"డను ఱేఁడు పాలించుచుండెను. భరతభగీరథ ప్రతీకాశుఁడగు నాధరణీశునకు మహేంద్రునకు బృహస్పతివలె దశరథునకు వశిష్ఠమహామునివలె 'శుకనాసుఁ' డను బ్రాహ్మణుఁడు ప్రధానామాత్యుఁడై యుండెను.

శంకరుని జటాజూటమునకు చంద్రలేఖ వలె, కమల నాభుని వక్షస్థలమునకు కౌస్తుభము కైవడి, నారాజ్యశిరో మణికి "విలాసవతి" యను పూబోణి పట్టపురాణియై యఖండశోభ నాపాదించెను. ఆ జనపాలుఁడు సమస్త వసుంధరాచక్రము జయించి మహామాత్యుఁడగు శుక నాసుని సాయమున ప్రజారంజకముగ రాజ్యము సేయుచు విలాసవతీ సహితుఁడై యౌవనోచితములగు సౌఖ్యముల నన్నింటి ననుభవించెను.

ఇట్లు పెక్కుసంవత్సరములు గతించినవి కాని యారాజ సంక్రందనునకు నందనముఖ సందర్శనానందము లభింప దయ్యెను. అనపత్య దోషముచే విఫలమనోరథుఁడగు నా వసుమతీపతి నరపతి సహస్రములతోఁ గూడియు నసహా యునివలె, కన్నులు గలిగియు గ్రుడ్డివానివలె తన్ను దలంచుకొనెను.

ఒకనాఁడా పుడమిఱేఁడు శుద్ధాంతమున కరిగి యందు పరిజనము పరివేష్టింప పెద్దముత్తైదువ లోదార్ప బాష్ప బిందు సందోహము సుందరకపోలముల జాలువార నలం కారములు ధరింపక మణిమయ తల్పమున గూరుచుండి వామకరమున మోమువాల్చి వగచుచున్న విలాసవతీ దేవిని వీక్షించెను.

అల్లంతదూరముననే తన్నుంగాంచి ఎదురుచనుదెంచు పట్టపుదేవిని పర్యంకమున గూర్చుండఁజేసి భూమీశ్వరుఁడామె పార్శ్వమున నాసీనుఁడై యాకల్యాణి కపోలముల జాలువగట్టు కన్నీరు మెల్లమెల్లఁగ నుత్తరీయమున నొత్తుచు "దేవీ! ఏల లోలోన నిట్లు దుఃఖించుచున్నావు? ప్రణయినీ! నీనయనములు బాష్పకణములు భరించుటకు హేతువేమి? తలోదరీ! అలంకరించుకొనలేదేమి? చెలీ! చిన్నారిమోము చిన్నబోయి యున్నదేమి? వరవర్ణినీ! నావలన నేదేని యపరాధము సంభవించెనా? విలాసినీ! దాసదాసీజన మెవ్వరేని నీ యానతి నతిక్రమించిరా? నా జీవితము త్వదధీనము. అనుగ్రహింపుము. విచారకారణము వినిపింపు"మని పరిపరివిధముల బ్రతిమాలెను.

మహీపతి వాక్యములకు మహారాజ్ఞి మఱింత సంతాపముతో మారు మాటాడలేక పోయెను. అంత నామె నెచ్చెలియగు మకరిక మహారాజుతో నిట్లు పలికినది.

"దేవా! దేవిగారి విషయమున దేవరవా రెట్టి లోపము చేసియుండలేదు. పరిజనము నిరపరాధము. తన జీవిత మంతయు విఫలమగుచున్నది గదా యని యమ్మగారు విచారించు చున్నారు. మహారాజుగారి మానసమునకుఁ గష్టము కలుగునను ననుమానము

తోడనే యింతదనుక నీమె తన దుఃఖమును బహిర్గత మొనర్పలేదు, ఈ నాఁడు చతుర్దశి యగుటచే "మహా కాల స్వామిని" సేవించుటకై దేవాలయమున కరిగినది. అచ్చట పురాణశ్రవణములో "సుతులు లేనివారికి గతులు లేవు" అను సూక్తి వినినది. ఆమాట యాలకించి మరలి మందిరమునకు వచ్చినది మొదలు దేవిగారి సంతాపమున కంతులేదు. ఆహారముఁగైకొనదు. అలంకారముల నంగీ కరింపదు. అడిగినమాటకు సమాధానము చెప్పదు. కంటికిఁ గడివెడుగా నేడ్చుచున్నది. ఉన్న విషయము ప్రభువులకు విన్నవించుకొంటి"నని మకరిక మిన్నకున్నది.

మకరిక మాటల నాలకించి మహారాజు ముహూర్త కాలము మౌనము వహించి వేడినిట్టూర్పుల నిగుడ్చుచు విలాసవతితో నిట్లు పలికెను. "దేవీ! ఇందులకు మన మేమి చేయఁగలము! వ్యర్థముగ శోకించుట వలనఁ బ్రయోజనమేమున్నది? భగవంతుఁడు మనయెడలఁ బ్రసన్నుఁడుగా లేఁడు. పుత్రగాత్రపరిష్వంగముచేఁ గలుగు సుఖానుభవమునకు మనము నోచుకొనలేదు. మన పురాకృత సుకృత మట్లున్నది. కానిమ్ము! ఇందులకు మనము చేయఁగలిగినదంతయుఁ జేయుదుము.

పెద్దలను మఱింత భక్తితో సేవింపుము. బీదల నాద రింపుము. దేవపూజలు ద్విగుణీకృతముగ నొనర్పుము.

ఋషిచంద్రులకు నమస్కరింపుము. ఋషులు దైవసమానులు. వారి యనుగ్రహమున్న ముల్లోకములందు దుర్లభమేముండును! నందనముఖ సందర్శనాభిలాష నాకు మాత్రము లేదనుకొంటివా! అనపత్యతాదుఃఖ మహోరాత్రము లగ్నివలె నా హృదయమును మాత్రము దహించుట లేదనుకొంటివా!

దైన్యమును విడువుము. ధైర్యము వహింపుము. ధర్మమార్గమునఁ జరింపుము. ధర్మపథవర్తనులకు కల్యాణసంతతులు కరతలామలకములు" ఇట్లు పలికి కన్నీరు తుడిచి మరలమరల మధుర వచనములతో రాణి నోదార్చి మహారా జంతఃపురము విడిచి యాత్మమందిరమున కరిగెను.

అది మొదలు మహారాజ్ఞి మానసము దేవతారాధనములందును, భూదేవతారాధనములందును, సాధుజన సపర్యలందును, గురుజన పరిచర్యలందును నిరంతరము నిమగ్నమయ్యెను. పరమపావనములగు గోవులను సేవించినది. దీనులకు దానధర్మములు గావించినది. సుప్రసిద్ధములగు పుణ్యతీర్థముల స్నానమొనర్చినది. వనస్పతులకు భక్తిశ్రద్ధలతోఁ బ్రదక్షిణము లాచరించినది. చతుష్పథములందు వాయసములకు బలులు వేయించినది. సిద్ధా

యతనముల దర్శించినది. వృద్ధజనోప దేశముల నంగీక రించినది. పుణ్యకథల నాకర్ణించినది. పుడమివేల్పులచే వేదపఠనము చేయించినది. ఈ విధముగ నా సతీమతల్లి సుతముఖాలోకన కుతూహలముతో కష్టమును లెక్కింపక యెవరేది చెప్పిన నదియంతయు నియమపురస్సర ముగ నిర్వర్తించినది.

ఇట్లు కొంత కాలము గడవ మహారాజొకనాటి తెల్ల వారు జామున సౌధాగ్రసమాసీనయగు విలాసవతీదేవి వదనబింబమున సకల కళాపరిపూర్ణమగు చంద్రబింబము ప్రవేశించినట్లు కమనీయమగు కమ్మని కలగాంచెను. అనంతర మమ్మహీకాంతుఁడు సంతోష తరంగితస్వాంతుఁడై యమాత్య శేఖరుఁడగు శుకనాసుని బిలిపించి స్వప్నవృత్తాంతము నంతయు వినిపించెను. మహామంత్రి హర్షాతిశయముతో నవనీపతి నవలోకించి "మహారాజా! ఈనాటికి మన మనోరథములు సఫలములైనవి. ప్రజల భాగ్యములు పండినవి. ప్రభువులవారు కొలఁది దినముల లోనే కుమారముఖ సందర్శనానందము ననుభవింపఁ గలరు. ఇంతకు ముందే నేనును ధౌతవస్త్రధారియు, శాంతమూర్తియు, దివ్య తేజోవిరాజితుఁడు నగు నొక ద్విజశేఖరుఁడు సహస్రదళ శోభిత మగు పద్మమును మదీయపత్నియగు మనోరమ తొడపై నుంచినట్లు కల

గంటిని. ఏవంవిధ శుభనిమిత్తములు ప్రత్యాసన్నములగు సుఖసంపదలకు సూచకములు గదా!" అని పలికెను. అనంతరము మహారాజు మంత్రిశేఖరుని కరకమలము గ్రహించి యంతిపురి కరిగి శుభోదర్కములగు తమ స్వప్న వృత్తాంతములను విలాసవతికి వినిపించి యాదేవి యంతరంగము నానందతరంగముల నోలలాడించెను.

కతిపయ దినములకు దేవతాప్రసాదమున విలాసవతి గర్భవతి యయ్యెను. క్రమముగ నవమాసములు నిండి యొకానొక శుభలగ్నమున రాణి సకలలోకానందకరుఁడగు నందనుని ప్రసవించెను.

ఆ శుభవర్తమానము నాలకించి ప్రజ లాబాలగోపాలము హర్షించిరి. చంద్రోదయముచే సముద్రము వలె పుత్రోదయముచే మహారాజు హృదయ ముప్పొంగెను. తారాపీడుఁడు శుకనాసునితోఁగూడి పుత్రసందర్శనాభిలాషతో సూతికాగృహంబున కరిగి, యందు విలాసవతి ప్రేమాంకములో బాలభానునివలె ప్రకాశించుచున్న నందనుని సందర్శించెను. మహామంత్రి సార్వభౌమ లక్షణలక్షితుఁడగు నా యర్భకుని యవయవసౌందర్యము నభివర్ణించుచు నరేంద్రుని హృదయము నానందసరసి నోలలాడించుచున్నంతలో నొక పరిచారకుఁడు సత్వర గమనమునఁ జనుదెంచి "ఏలినవారికి జయము జయము!

మహామాత్యుల పత్నియగు మనోరమకు రేణుకకు పరశు రాముఁడువలె కుమారుఁడు జన్మించెను." అని పలికెను.

అమృతోపమానములగు వాని వాక్యము లాకర్ణించి తారాపీడధరణీశుఁడు ప్రీతివిస్ఫారితలోచనుఁడై "ఓహో! కల్యాణ పరంపర! కష్టముపైఁ గష్టమును సంతోష ముపై సంతోషమును సంభవించు నను జనప్రవాదము సత్యమైనది." అని పలికి ప్రఫుల్లవదనాంబుజుఁడై శుక నాసుని గౌగిలించుకొని, శుభవర్తమానముఁ దెచ్చిన పరిచారకునకు గొప్ప పారితోషక మొసంగి, మహా మంత్రితోఁగూడి, నానావిధమంగళవాద్యములు మ్రోయ నచ్చోటు వీడి శుకనాసుని భవనమునకుఁజని పుత్రోత్సవ మును ద్విగుణీకృతముగ నొనరించెను.

అనంతరము మహారాజు పదియవదినము శుభము హూర్తమున మహావైభవముగ పుత్రునకు జాతకర్మాది విధుల నిర్వర్తించి స్వప్నమునందు సంపూర్ణచంద్ర మండలము రాణి ముఖమునఁ బ్రవేశించినట్లు గాంచు టచే తదనురూపముగ నా బాలునకు "చంద్రాపీడుఁ" డని నామకరణమొనర్చెను. మఱునాఁడు మహామాత్యుఁ డును బ్రాహ్మణోచితములగు విధులన్నియు నిర్వర్తించి తనకుమారునకు "వైశంపాయనుఁ"డని పేరుపెట్టెను.

# పంచమ విలాసము

కాలక్రమమున చంద్రాపీడునకు శైశవ మతిక్రమిం చెను. తారాపీడభూపాలుఁడు తనయుని విద్యాభ్యాస మునకై పట్టణమున కనతిదూరమున శిప్రానదీతీరమున నొక విశాల మైన విద్యామందిరమును గట్టించెను. అందు సకలశాస్త్రపారంగతు లగు నాచార్యుల నియ మించి వైశంపాయనసహితుఁడగు చంద్రాపీడుని జది వించుచుండెను.

మహారాజనందనుఁడు మంత్రినందనునితోఁ గూడ నచిరకాలములోనే సకలకళాసమలంకృతుఁ డయ్యెను. తర్క-వ్యాకరణ వేదాంతములయందును, నీతిశాస్త్రము నందును, వ్యాయామ కళయందును, గజ తురగ రథా రోహణముల యందును, నృత్యశాస్త్రము నందును, సంగీతశాస్త్రము నందును, ధనుర్విద్యయందును, సర్వ లిపులయందును, సమస్త దేశభాషలయందును, సంపూర్ణ పాండిత్యము సంపాదించి యాకుమారు లొక్క క్షణ మైన యెడబాటును మాట యెఱుంగక పరస్పరసౌహా ర్దంబున నన్నదమ్ములట్లు మెలఁగుచుండిరి.

చంద్రాపీడునకు బాల్యమునందే సకలలోకవిస్మయకరమగు మహాబలము సంప్రాప్తమయ్యెను. ఆ రాకుమారుఁడు క్రీడాపరాయణుఁడై చెవులుపట్టి నిలిపినంతనె యేనుఁగుగున్నలు కాలుకదపక నిలుచఁబడుచుండెను. ఆ వీరకుమారుని యేకైకఖడ్గప్రహారమునకుఁ దాళవృక్షములు తామరతూండ్లవలె ముక్కలుముక్కలగుచుండెను. ఆ మేటివిలుకాని ములుకులు పరశురాముని బాణములట్లు పర్వతములను ఛిద్రములు చేయుచుండెను. పదుగురు బలముగల మనుష్యులు మోయలేని యయోదండము నవలీలఁ గేలధరించి యతఁడు పరిశ్రమమొనర్చుచుండెను. ఒక పరాక్రమమునఁ దప్ప మంత్రికుమారుఁడు రాజకుమారున కేవిషయమునను దీసిపోక వివిధవిద్యావిశేషసంపన్నుఁడై విరాజిల్లెను.

క్రమక్రమముగ బాల్యము గడచిపోయినది. యౌవన మడుగువెట్టినది.

ఇంద్రధనుస్సుతోఁ గూడిన మేఘమండలమువలె నవయౌవనాభిరాముఁడగు రాకుమారుని సౌందర్యము ద్విగుణీకృతమయ్యెను.

ఇవ్విధమున సమారూఢయౌవనుఁడును, సకలవిద్యాసమలంకృతుఁడు నగు కుమారుని దోడితెచ్చుటకై మహారాజొకదినమున వలాహకుఁడను సేనానాయకుని

బంపించెను. ఆతఁడును విద్యామందిరమున కేగి రాజకుమారునకు జోహారు లొనర్చి వినయపూర్వకముగా నిట్లు విజ్ఞప్తి చేసెను.

రాజనందనా! నీవు సమస్తవిద్యలయందు సంపూర్ణ పాండిత్యము సంపాదించితి వని విని మహారాజుగారు సంతోషించుచున్నారు. అధ్యాపకులచే ననుజ్ఞవడసిన నిన్ను గృహమునకుఁ గొనివచ్చుటకై నన్నుఁ బంపినారు. సకలకళాసంపూర్ణుఁడ వగు నీసందర్శనము చంద్రదర్శనము వలె జనులకు సంతోషదాయక మగుగాక. ఆఱవ సంవత్సరమున విద్యాలయమున బ్రవేశించితివి. విద్యాభ్యాసము ప్రారంభించి పదిసంవత్సరము లైనది. ఇప్పటికి షోడశ వర్షప్రాయుఁడ వైతివి. నీ జనని నిన్నుఁ జూచుటకు మిక్కిలి వేడుకపడుచున్నది. రమ్ము! రాజలోకమును సమ్మానింపుము. ప్రజలను బరిపాలింపుము. బందుగుల నానందింపఁ జేయుము. అల్లదిగో "ఇంద్రాయుధ" మను తురంగము! దీనిని మీ తండ్రిగారికిఁ బారశీక దేశాధిపతి బహూకరించినాఁడు. ఇది సముద్రములో జనించినది. ఉచ్చైశ్శ్రవమునకు సమానమైన లక్షణములు గలది. వాయువేగముతో నలరారునది. ఇటువంటి హయము భూతలమున "న భూతో న భవిష్యతి" యని లక్షణవేత్తల మెప్పుగన్నది.

ఇట్లు వలాహకుఁడు వచింప విని రాకుమారుఁడు మహాప్రసాదమని తండ్రియానతి తలదాల్చి వైశంపాయన సహితుఁడై యదృష్టపూర్వము, నశేష శుభలక్షణ లక్షితమునగు నయ్యశ్వమును సమీపించి దాని తేజో విశేషమునకచ్చెరు వందెను. అనంతరము "మహాత్మా! నీ వెవ్వండవో దివ్యమూర్తివి వలె గోచరించుచున్నావు. నీకు నమస్కృతులు. నా యారోహణాపరాధమును మన్నింపు"మని ప్రార్థించి నరేంద్రనందనుఁ డింద్రాయుధము నధిరోహించెను. ఆ తురంగమంబును రాజకుమారుని మాటలు గ్రహించినట్లు తలయూఁపి సకిలించినది.

అనంతరము మఱి యొక వారువము నారోహించి మంత్రికుమారుఁడు తన్ననుసరింప చంద్రాపీడుఁడు రాజకుమారుల వందనము లందుకొనుచు, వందిమాగధుల కైవారములు వినుచు పట్టణము ప్రవేశించెను. రాకుమారుఁడు విద్యామందిరమునుండి వచ్చుచున్నాఁడని విన్నంతనే కుతూహలాయత్తము లగు చిత్తములతో పౌరులు గుంపులుగూడిరి. సౌధాగ్రములు సందర్శనపరాయణలగు రమణీమణులతోఁ గిక్కిఱిసిపోయెను.

ఇట్లు రాజమందిరము సమీపించి చంద్రాపీడుఁ డింద్రాయుధము దిగి వైశంపాయనుని కరంబు గ్రహించి, వలాహకుఁడు మార్గంబు చూప సభామంటపమునకుఁ

జని రెండవపాకశాసనుని వలె నిండుపేరోలగం బున్న జనకుని చరణకమలములకు నమస్కరించెను.

అంత భూకాంతుఁడు "రమ్మరమ్మ"ని కరమ్ములు సాచి యానందాశ్రువు లుప్పొంగ నాత్మజు నాలింగనము చేసికొనెను. అనంతరము సుతనిర్విశేషుండగు వైశంపాయనుని గౌగిలించుకొని తారాపీడుండు తనయుం గాంచి "వత్సా! మీ యమ్మ నిన్నుఁ జూచుటకై తొందరపడు చున్నది. సత్వరముగఁ జని సందర్శింపు"మని వచించు టయు రాకుమారుఁడు మంత్రికుమారునితోఁ గూడి యంతఃపురమున కరిగి జననికి వందనము లొనర్చెను.

విలాసవతియు వినమ్రుఁ డగు కుమారుని శిరంబు మూర్కొని కడుంగడు గారవమున గాఢాలింగన మొనర్చి యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని యానంద బాష్పములతో నతని శిరము నభిషేకించినది. అట్లే వైశంపాయనుని గూడ లాలించి దగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొనినది. అనంతరము కరతలమున నందనుని వక్షము, లలాటము, భుజాగ్రములు స్పృశించుచు "నాయనా! మీ నాయనగా రెంత కఠినులు! ఇంత కాలము నిన్నెంత కష్టపెట్టిరి! ఎన్ని చదువులు చదివించిరి! ఈ లేతవయస్సులో సకలవిద్యావిభూషితుఁడ వైన నిన్[illegible]చి సంతసించితిని. అచిరకాలములో ననురూప

వధూసమేతుఁడ వగు నిన్నవలోకింప నభిలషించు చున్నా"నని పలుకుచు లజ్జావనతముఖుఁ డగు నాతని చెక్కుటద్దములు ముద్దాడినది.

ఇట్లు చంద్రాపీడుఁడు కొంచెముసేపు తల్లి చెంత గడపి యనంతర మామె యనుజ్ఞ గైకొని వైశంపాయన సమేతుఁడై శుకనాసుని సౌధమున కేగి యవనతశిర ముతో న య్యమాత్య శేఖరునకు నమస్కరించెను.

శుకనాసుండును వినయవినమ్రుఁ డగు రాకుమారుని లేవనెత్తి సంతోషబాష్పములు జాలువాఱ వైశంపాయ నునితోఁ గూడఁ గౌగిలించి గారవించెను. అనంతరము సాదరముగ సమీపమునఁ గూరుచుండఁ బెట్టుకొని హర్ష పులకితశరీరుఁడై "తండ్రీ! చంద్రాపీడా! నేఁటికి మాతపం బులు ఫలించినవి. మహారాజు భాగ్యము పండినది. కులదేవతలు ప్రసన్నులైరి. ప్రజలు ధన్యులైరి. భరత భగీరథ ప్రతిముఁడ వైన నీవంటి ప్రభువు లభించుట కన్న వారికి భాగ్య మేమున్నది! ఆహా! నీ వయ సెక్కడ! అమానుషంబగు నీ విద్యాగ్రహణ సామర్థ్య మెక్కడ! నీ తండ్రితోఁ గూడ భూభారమును వహింం పుము. ప్రజారంజన మొనరింపుము."

అని పలికి శుకనాసుఁ డక్కుమారులను పెక్కు విధ ములగొనియాడి వసనాంగరాగకుసుమాదుల సత్కరించి వీడ్కొలిపెను. అంత రాజకుమారుఁడు వైశంపాయ నునితోఁ గలిసి మంత్రిపత్ని యగు మనోరమను సంద ర్శించి యామె ఆశీస్సులందుకొని యనంతర మింద్రా యుధము నధిష్ఠించి తండ్రిచేఁ దనకై క్రొత్తగా నిర్మింపఁ బడిన భవనంబునఁ బ్రవేశించెను.

మఱు దినము కైలాసుండను కంచుకి "పత్రలేఖ" యను బాలిక నొక్కతెను వెంటబెట్టుకొని వచ్చి రాజ కుమారునకు నమస్కరించి యిట్లు విజ్ఞప్తి చేసెను. "కుమారా! విలాసవతీదేవిగారిట్లాజ్ఞాపించుచున్నారు. ఈ చిన్నది కులూతేశ్వరుని కుమారి. ఈమె నామము "పత్రలేఖ". నీ తండ్రిగారు జైత్రయాత్రకు వెడలి కులూ త దేశమును జయించినప్పు డీ బాలికామణిని వెంటగొని వచ్చి యతఃపురమున నుంచిరి. అనాథ యగు ఈ రాజ పుత్రిని మిక్కిలి యక్కటికముతోఁ బెంచితిని. ఇప్పు డికుమారి నీకు తాంబూలకరండవాహినిగా నుండఁ దగునని నీ యంతికమున కంపితిని. నీ వీ పూవుబోఁడిని సామాన్య దృష్టితోఁ జూడక శిష్యురాలిగా గౌరవిం పుము! స్నేహితురాలిగా మన్నింపుము!"

అని పలుకుచున్న కైలాసుని వాక్యములువిని చంద్రాపీడుడు "అమ్మగారి యాజ్ఞప్రకారమే నడచుకొందు" నని మనవిచేయుము! పో"మ్మని వాని నంపివేసెను. పత్రలేఖయు నదిమొదలహోరాత్రములు తోడునీడవలె నెడబాయక సేవించుచు రాజకుమారున కత్యంత ప్రేమపాత్ర మయ్యెను.

ఇట్లు కొన్నిదినములు గడచిన యనంతరము తారాపీడ మహారాజు తన కుమారుని యౌవరాజ్యపట్టభద్రుని గాఁ జేయ నెంచి సమస్తసంభారములు సమకూర్చెను.



# షష్ఠ విలాసము

ఒకనాఁడు తన్ను సందర్శింప వచ్చిన చంద్రాపీడుని సమీపమునఁ గూర్చుండఁ బెట్టుకొని శుకనాసమహామాత్యుఁ డిట్లుపదేశించెను.

"వత్సా! చంద్రాపీడా! సమస్తశాస్త్రములు నభ్యసించితివి! తెలియవలసిన విషయము లన్నియు దెలిసికొంటివి. నీకు నేను వేఱుగా నుపదేశింప వలసిన దేమున్నది! అయినను చెప్పుచున్నాను. యౌవనము కన్నుమిన్ను గానరాని గాఢాంధకారమువంటిది. ఐశ్వర్యగర్వము మిక్కిలి భయంకరమైనది. లోకమున నైశ్వర్యము, యౌవనము, అప్రతిమానసౌందర్యము, అమానుషశక్తి యనునివి యనర్థపరంపర. ఇం దొక్కటొక్కటే సమస్తదోషములకు నాలవాల మనిన నన్నియు నొక్కచో నున్నప్పు డేమి చెప్పవలయును.

నిజమునకు నీవంటివారే యుపదేశమునకు యోగ్యులు. స్ఫటికమణియందు చంద్రకిరణములు వలె స్వచ్ఛమైన మానసమున నుపదేశగుణములు సులభముగాఁ బ్రవేశించును. గురూపదేశము పురుషులకు సమస్తదోషముల శమింపఁజేయు స్నానము. విశేషముగా రాజుల కుపదే

శించువారు లేరు. జనులు భయభ్రాంతులై ప్రతిధ్వనుల వలె ప్రభువాక్యము లనుకరింతురు. ధన మదము దాటరానిది. రాజులస్వభావ మహంకార దూషితము. ధనము లున్మాద కారణములు. ప్రభుత్వము విష వికార విలసితము. లక్ష్మి క్రమిక్కలి చంచల మైనది. పాశములచే బంధింపఁబడియుఁ బరువెత్తిపోవును. బలవంతు లగు భట సహస్రములచే బహువిధముల రక్షింపఁబడియుఁ దప్పించుకొని తరలిపోవును. పరిచయమును పాలింపదు. కులము నవలోకింపదు. సౌందర్యమును దర్శింపదు. వంశక్రమమున వర్తింపదు. వైదగ్ధ్యమును గుర్తింపదు. శీలమును జూడదు. కళను గౌరవింపదు. త్యాగము నాదరింపదు. విశేషజ్ఞతను విచారింపదు. ఆచారమును పాలింపదు. సత్యమును దెలిసికొనదు. గంధర్వనగరివలెఁ జూచుచుండఁగనే మాయమగును.

ఈ లక్ష్మి సరస్వతీసంపన్నుని సమీపింపదు. గుణవంతుని నపవిత్రునివలె స్పృశింపదు. సజ్జనునివైపు గన్నెత్తిచూడదు. సద్వంశసంజాతుని దృణీకరించును. దాతను బరిత్యజించును. పౌరుషవంతుని బరిహసించును. దీని చరిత్ర మింద్రజాలము వంటిది. ఇయ్యది తృష్ణయను విషలతలకు జలధార. ఇంద్రియము లను మృగములకు కిరాతగానము. సచ్చరిత్రము లను చిత్రములకు ధూమ

రేఖ. మోహమను నిద్రకు విశాలశయ్య. ధనమదపిశాచములకు నివాసగృహము. కపటనాటకమునకు ప్రస్తావన. సాధుభావమునకు వధ్యశాల. ధర్మేందుమండలమునకు రాహుజిహ్వ.

ధనగర్వాంధుల వికారకృత్యము లెన్నని వర్ణింపను. వారు కన్నులుండియుఁ గనలేరు. వీనులుండియు వినలేరు. గ్రహములచే గ్రహింపఁబడినవారివలె, భూతములచే ఆవేశింపఁబడినవారి విధమున, పిశాచములచే మ్రింగఁబడిన వారికైవడి బ్రవర్తింతురు. కుళీరములవలె నడ్డముగ నడతురు. ముఖరోగముగలవారివలె నతికష్టముగ పట్టిపట్టి మాటాడుదురు. మృత్యువాసన్నమైనవారివలె నెదుటనున్న బంధువులను సయితము గుర్తింపరు. వారికీప్రపంచమంతయు బంగారు రేకులు పఱచియున్నట్లు గాన్పించును.

కొందఱు ద్యూతము వినోద మనియు, పరదారాభిగమనము పాండిత్య మనియు, స్వదార పరిత్యాగము వ్యసన త్యాగమనియు, పానము విలాస మనియు, తన తప్పుల నాలకింప కుండుటయే మహానుభావత్వ మనియు, శ్లోకాపవాదము సహించుటయే క్షమ యనియు, విచ్చలవిడి సంచరించుట ప్రభుత్వ మనియు, వందిమాగధుల

కై వారములే కీర్తియనియు, దోషములను గుణములుగ వర్ణించుచు తమలోఁ దాము నవ్వుకొనుచు పరులను మోసగించు ధూర్తబకములవంటి స్వార్థపరుల ముఖ స్తుతులచే వచింపఁ బడుచుందురు. తమలోఁదాము దేవతాంశ సంభూతుల మని భావింతురు. మిగిలిన రెండు చేతులును లోపల నున్నవిగా నూహింతురు. మూఁడవ కన్ను నెన్నొసట నున్నట్లే తలంతురు. దర్శనప్రదానమే యనుగ్రహముగ గణింతురు. ఆజ్ఞాపించుటయే వరప్రదాన మనుకొందురు. పూజ్యులను పూజింపరు. గురువులను గౌరవింపరు. విద్వజ్జనుల నాదరింపరు. వృద్ధజనోపదేశము నాలకింపరు. హితచింతకులపైఁ గోపింతురు. ఎవ్వఁడు చేతులు గట్టుకొని దివారాత్రములు తమ్ము ప్రత్యక్ష భగవంతునిగా ప్రస్తుతించుచుండునో యట్టి వానినే బహుమానింతురు. వానితో మాటాడుదురు. వానివాక్య ములు విందురు. వానినే ప్రాణమిత్రునిగ భావింతురు.

రాజకుమారా! నీవెన్నడు నట్టి మార్గములఁ గాలు పెట్టకుము. ప్రజల యభిమానమును చూఱగొనుము. గురూపదేశముల గౌరవింపుము. మిత్రుల నాదరింపుము. ధూర్తులఁ గనిపెట్టియుండుము. నీవు సహజముగ ధీరుఁ డవు. జనకునిచే సకల కళాసమలంకృతుఁడ వైతివి. నవ యౌవరాజ్యాభిషేక మనుభవింపుము. కులక్రమా

గతముగ నీపూర్వపురుషులచే వహింపఁబడిన భూభారమును వహింపుము. విరోధి శిరముల వినమ్రములు గావింపుము. అభిషేకానంతరము జైత్రయాత్ర ప్రారంభించి నీజనకునిచే జయింపఁబడిన సప్తద్వీప సముద్రసమలంకృతయగు వసుంధరను మరల జయింపుము" అని పలికి మహామంత్రి విరమించెను.

చంద్రాపీడుఁడు శుకనాసుని మహోపదేశముచే స్వచ్ఛీకృతుఁడైన వానివలె, సమభిషిక్తుఁడైన వానివలె సమలంకృతుఁడైన వానివలె, పవిత్రభూతుఁడైన వానివలె, ప్రకాశమానుఁడైన వానివలె, సంప్రీత హృదయుఁడై కొంతకాల ముండి యాత్మప్రాసాదము కరిగెను.



# సప్తము విలాసము

అనంతర మొక్క పుణ్యముహూర్తంబున నరపతి సహస్రములు గొలువ నరేంద్ర చంద్రుడు చంద్రాపీడుని యౌవరాజ్యమునకు పట్టాభిషిక్తుని జేసెను. చంద్రుడు మేరుశృంగము నధిరోహించి నట్లు చంద్రాపీడుడు సింహాసనము నారోహించెను. సభ్యుల జయజయ ధ్వానములు మిన్ను ముట్టినవి. ప్రజలందరు నానందపరవశులైరి. దిగ్విజయయాత్రా సూచకముగ ప్రస్థాన విజయభేరి మ్రోగినది. సకల సామంత భూపాలసహితుడై చంద్రాపీడుడు సింహాసనమునుండి లేచి యాస్థాన మండపమును వెలువడి ప్రయాణసన్నద్ధుడయ్యెను.

అనంతరము జనకుని యనుజ్ఞవడసి చతురంగవాహినీ సమన్వితుడై వైశంపాయనుడు వెంబడింప చిత్రరేఖతో గూడి జైత్రయాత్రకై బయలు వెడలెను.

క్రమక్రమముగా దొలుదొల్త పూర్వదిక్కును, దరువాత దక్షిణమును, అనంతరము పశ్చిమమును, ఆపైన నుత్తరమును జయించి, శరణాగతుల రక్షించుచు, విరోధుల నిర్మూలించుచు, రాజకుమారుల నభిషేకించుచు, రత్నసమూహముల సముపార్జించుచు,

బహుమతులం బరిగ్రహించుచు కప్పముల నందుకొనుచు, విజయ స్తంభముల సంస్థాపించుచు, శాసనములను చెక్కించుచు, మున్యాశ్రమములను కాపాడుచు, జనానురాగమును సంపాదించుచు, పౌరుషమును బ్రకాశింపఁజేయుచు, ధరణీచక్ర మెల్లఁ బరిభ్రమించి మూఁడు సంవత్సరములలో సమస్త రాజ్యములను జయించెను.

అనంతరము చంద్రాపీడుఁడు కైలాస సమీపమున నున్న సువర్ణపురమును జయించి తనసేనతోనాక్రాంతమున విశ్రాంతికై కొంతకాలము నివసించెను.

చంద్రాపీడుఁ డొకనాడింద్రాయుధము నెక్కి యొక్కరుండమృగయా విహారార్థమై, సమీపమందలి యరణ్యమున కేగి యందందు సంచరించుచు గిరిశిఖరము నుండి క్రిందికి దిగుచున్న కిన్నరమిథునము నవలోకించెను.

అత్యద్భుతము నదృష్టపూర్వ మగు నామిథునమును సందర్శించి మిక్కిలి సంతసించుచు నంతరంగమున కుతూహలముప్పొంగ నద్దానింబట్టుకొన నెంచి, ఇంద్రాయుధము నటువైపు పోనిచ్చెను. ఆ కిన్నర మిథునంబును రాజకుమారునిం గాంచి భయభ్రాంతమై పరువెత్తసాగెను. చంద్రాపీడుఁ డశ్వరాజము నతి త్వరితముగ దానివెంటఁ బరువెత్తించి "అదిగో గ్రహించితి. నిదిగో

గ్రహించితి” నని ముహూర్తమాత్రములో పదునైదామడలదూర మతిక్రమించెను.

ఆ కిన్నరమిథున మట్లు పోయిపోయి రాజకుమారుఁడు చూచుచుండఁగనే మహోన్నతమగు నా మహీధర శిఖరము నారోహించెను.

ఆపర్వతమార్గము దుర్గమమగుటచే రాజకుమారుఁడు శరీరమంతయుఁ జెమ్మటలు గ్రమ్మ నలసిపోయినయశ్వము నాపి కిన్నరమిథునంబు నిఁకఁ జిక్కించుకొన జాలనని నిస్పృహఁ జెందెను. అనవసరముగ నింతదూర మరుదెంచిన తన యవివేకమునకు బశ్చాత్తాపపడి యాత్మగతంబున నతం డిట్లు తలపోసెను.

“ఆహా! నాలో నాకే నవ్వువచ్చుచున్నది. ఎంత దూరము వచ్చితిని. ఈ కిన్నర మిథునమును గ్రహించు బుద్ధి నా కేల పుట్టినది? దీనివలన నా కేమి యుపయోగము?” అని పరిపరివిధముల విచారించుచు వామహస్తమున పగ్గములు బిగ్గపట్టి తురంగమును మరలించి మరల నిట్లు చింతింపసాగెను. “ఎంతదూరము చనుదెంచితినో తెలియదు. ఇచ్చటికి నాసేన లెంతదూరములో నున్నవో తెలియదు. ప్రారంభించిన దైత్రయాత్ర పరిపూర్ణము కాలేదు. ఇప్పు డీ యరణ్యములో నాకు

మార్గ మెఱింగించు వాఁడెవ్వఁడు? ఇది కైలాసగిరి కాఁబోలు. ఇందు మనుష్య సంచార ముండదు. అంతయు నయోమయముగ నున్నది. నా వారి నెట్లు కలిసికొందును? భాస్కరుఁ డంబరమధ్యము నధిష్ఠించినాఁడు. ఈ యింద్రాయుధము మిక్కిలి యలసిపోయినది. కొంచెము మేఁత మేసినతరువాత జలములు ద్రావించి, నేనును ద్రావి, మార్గాయాస ముపశమింప నేదేని చెట్టునీడ నొక్కింతసేపు విశ్రమించి యనంతర మరిగెదను గాక."

అని నిశ్చయించుకొని జలాన్వేషణార్థ మటు నిటుఁ దిరుగుచు కొంత దూర మరిగి యచ్చోట నత్యంత సుందరమైహృదయాహ్లాదకరమైయొప్పుచున్న "అచ్ఛోద" మను నొక్క సరోవరమును సందర్శించెను.

ఆలోకమాత్రముననే యపగతశ్రముఁడై యారాజనందనుఁడు సరోవరతీరంబున కరిగి యందలి ప్రకృతి శోభావైభవమునకు మిక్కిలి సంతసించుచు తురంగము నవరోహించి చల్లనిజలంబులఁ ద్రావించి తానును ద్రావి యొక వృక్షముక్రింద విశ్రమించెను.

ఇంతలో నాకొలని యుత్తరదిశనుండి యొక మధుర గీతము చంద్రాపీడునకు శ్రవణపర్వము గావించినది. అంత నారాజకుమారుఁడు మనోమోహకమగు నా

మధురగీతి నాలించి మనుష్యసంచారములేని యిచ్చోట నిది యెచ్చటనుండి వచ్చినదని వితర్కించుచు నింద్రా యుధము నధిరోహించి సరోవరము పశ్చిమతీరముననే చనిచని యొక సిద్ధాయతనమును గాంచెను. స్ఫటిక శిలానిర్మితమగు నమ్మంటప మధ్యభాగమున మందాకినీ పుండరీకములచేఁ బూజితంబై యున్న యొక శివలింగము నాలోకించెను.

మఱియు నా శివలింగమునకు నభిముఖముగ నాసీను రాలై దక్షిణహస్తాగ్రముతో వీణియ మేళవించుచు సాక్షాత్కరించిన సంగీత దేవతయో యన ముక్తకంఠ మున మహాదేవునిఁ గీర్తించుచున్న యొక్క కన్యా రత్నమును గనుంగొనెను.

రాజనందనుఁ డా సుందరి రూపరేఖావిలాసముల కచ్చెరువంది యశ్వము నవరోహించి, చేరువ నున్న తరు మూలమున నశ్వారువమును బంధించి, భగవంతుఁడైన పరమేశ్వరునకు భక్తిపూర్వకముగఁ బ్రణమిల్లి గీతావ సానము నపేక్షించుచు నచ్చటఁ గూర్చుండెను.

అంత గీతావసానంబున నక్కన్యక విపంచి నొక్కచో నుంచి పరమశివునకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచ రించి చంద్రాపీడు నవలోకించి "అతిథికి స్వాగతము!

మహాభాగు లిచ్చోటి కెట్లు రాగల్గితిరి? రండు! నా వెంట దయచేయుఁడు. అతిథిసత్కారము నందుకొనుఁ" డని పరమ ప్రశాంత మగు కంఠస్వరముతో నాహ్వానించినది.

రాజకుమారుఁడు సంభాషణ మాత్రముననే యామె తన్ననుగ్రహించినట్లు దలంచి భక్తితో నమస్కరించి వినయవినమ్రుఁడై యంతేవాసివలె నయ్యింతిఁ వెంబడిఁ జని యామె యాతిథ్యమును స్వీకరించెను.

అనంతరము క్షణకాల మూరకుండి యా రమణీమణి ప్రశ్నింప దిగ్విజయము మొదలుకొని తా నచ్చోటికి వచ్చునంతవఱకుఁ గల స్వీయవృత్తాంత మంతయు నెఱింగించెను.



# అష్టమ విలాసము

అనంతరము చంద్రాపీడుఁడు పరిసమాపితాహారుఁడై యొక్క శిలాతలమున నుపవిష్టుఁడై యున్న యక్కన్నెను మెల్లఁగ సమీపించి నాతిదూరంబునఁ గూర్చుండి వినయ పూర్వకముగ నిట్లనెను.

"భగవతీ! నీయనుగ్రహమునకు ధన్యవాదములు. నిన్నుదర్శించినది మొదలు నీ చరిత్రము నెఱుంగుటకై హృదయ మువ్విళ్లూరుచున్నది. దేవతలు, మహర్షులు, గంధర్వులు, గుహ్యకులు, అప్సరసలు మొదలగు వారిలో నెవ్వరి వంశము భగవతి జన్మముచే పవిత్రతమైనది? కుసుమ సుకుమార మైన యీ లేఁబ్రాయమున నీ కఠోర వ్రతం బేల గైకొంటివి? ఈ వయసెక్కడ! ఈ తప స్సెక్కడ! మనోహరమగు నీ తనూలావణ్య మెక్కడ! ఈ ప్రశాంతమగు నీవేషధారణ మెక్కడ! ఇది మిక్కిలి యక్కజము గొల్పుచున్నది. కావున భగవతి పవిత్ర చరిత్రము సమస్తమును వినిపించి నా కుతూహలమును దీర్పవలెనని ప్రార్థించుచున్నాను.

ఇట్లు చంద్రాపీడుఁడు ప్రార్థింప నాదివ్యకన్యక నిట్టూర్పుఁ బుచ్చి యొక్కింత కాలమేదియో ధ్యానించి

కన్నీరు దుడుచుకొని మెల్లఁగా నిట్లు ప్రత్యుత్తర మొసఁగెను.

"నరేంద్రనందనా! కఠోరహృదయను, దురదృష్ట వంతురాలను. పాపాత్మురాలనగు నా జన్మ వృత్తాంత శ్రవణముచే నీకుఁ గల్గుప్రయోజనం బేమి? ఐనను కౌతూహలముగల దంటివి గావునఁ జెప్పుచున్నా నాల కింపుము.

రాజకుమారా! స్వర్గలోకమున నప్సరసలు గల రను సంగతినీవు వినియే యుందువు. వారిలో పదునా లుగు కులంబు లొప్పారుచుండును. అందు దక్షప్రజాపతి పుత్రిక లగు ముని-అరిష్ట యను నిరువురు కన్యలవలన రెండు గంధర్వకులంబులు ప్రవర్తిల్లినవి. అందు "ముని" యను నామె కుమారులగు చిత్రసేనాదులలో పదునా అవ వాఁడు చిత్రరథుండన నొప్పుచుండును. సుగుణా ధనుఁడు పరాక్రమవంతుఁడగు నాతఁడు సమస్తగంధర్వు లకు నధిపతియయ్యెను. ఆతని నివాసస్థానము భారత వర్షమునకు నుత్తరమునఁ గల కింపురుష వర్షము నందలి హేమకూటపర్వతము. ఈ చిత్రరథుఁడు మహేంద్రునకు మిత్రుఁడై యిచ్చోటఁ దన పేరు మీఁదుగ "చైత్రరథం" బను నుద్యానవనంబు నిర్మించెను. "అచ్ఛోదం" బను

నీ సరోవరంబను ద్రవ్వించి భగవంతుఁడగు పరమశివు నిందుఁ బ్రతిష్ఠించెను.

ఇంక "అరిష్ట" కుమారులగు తుంబురుఁడు మొదలగు వారిలోఁ బెద్దవాఁడగు హంసుఁడు రెండవ గంధర్వ కులంబునకుఁ బ్రభువుగా గంధర్వరాజగు చిత్రరథునిచే నభిషిక్తుఁడై హేమకూటమునందే నివసించుచున్నాఁడు. చంద్రకిరణసంభూత మగు నచ్చరలకులమున జన్మించిన జగదేక సౌందర్యవతి యగు "గౌరి" యను కన్యాలలామ నీ హంసుడు వివాహమాడెను. మహానుభావులగునట్టి దంపతులకు విగతలక్షణురాలను దుఃఖసహస్రభాజనంబ నగు నే నేకైకతనూజనై జన్మించితిని. మదీయజనకుఁ డనపత్యుఁ డగుటచే సుతజన్మాతిరిక్త మగు మహోత్స వంబుచే నాపుట్టువు నభినందించి పదియవనాఁడు నాకు "మహాశ్వేత" యను నన్వర్థ నామధేయ మిడెను. నేనును పితృగృహమున మిక్కిలి గారాబముతోఁ బెరుగుచు శోకాయాసముల నేమాత్రము నెఱుంగక కమనీయగానమనోహారిణియగు వీణాకుమారివలె గంధ ర్వుల ప్రేమాంకముల సంచరించుచు క్రమక్రమముగా శైశవము నతిక్రమించితిని.

అనంతరము మధుమాసముచే వసంతము వలె, నవ పల్లవముచే మధుమాసమువలె, కుసుమముచే నవపల్ల

నమువలె, మధుకరముచే కుసుమమువలె, మదముచే మధుకరమువలె, నవయౌవనముచే నా శరీరము విలాస సంపన్న మయ్యెను.

తరువాత సకలలోక హృదయానంద దాయక మగు వసంత ఋతువునం దొకనాఁడు నా జననితోఁ గూడి "యచ్ఛోదంబు" న స్నానమాడ దలంచి యిచ్చోటికి వచ్చి సరోవర తీరంబున సఖీజన సమేతనై సంచరించు చుంటిని. అంతలో నెచ్చటనుండియో నపూర్వంబగు పుష్పసౌరభమాఘ్రాణించితిని." ఇట్టిహృదయంగమ మగు పరిమళ మెచ్చటినుండి వచ్చెనని కుతూహలంబునఁ గొన్ని యడుగులు నడచి యచ్చోట సమానవయస్కుం డగు మఱియొక తాపసకుమారునితోఁ గూడి స్నానార్థ మేగుదెంచిన సుందర సుకుమారుండగు నొక మునికు మారు నవలోకించితిని. ఆతని చెవియందు నదృష్టపూర్వం బగు నొక్క కుసుమ మంజరిని గాంచి దీని సౌరభమే యన్య కుసుమ గంధమును దిరస్కరించి నాకు హాయి గూర్చినదని నిశ్చయించుకొంటిని.

అనంతర మామునినందనునిచక్కదనమునకక్కజము నంది మైమఱచిపోతిని. అంత నాతని సహచరుఁడగు మునికుమారుని సమీపించి ప్రణామపూర్వకముగ నిట్లు ప్రశ్నించితిని.

"ఆర్యా! యీతని పేరేమి? జననీ జనకు లెవ్వరు? ఈసంయమికుమారుని శ్రవణావతంస మగు నీ కుసుమ మంజరి యే వృక్షమునకు సంబంధించినది? దీని సౌరభ మనాఘ్రాతపూర్వమై యసాధారణమై యొప్పుచున్నది".

ఆ మునికుమారుడు నా ప్రశ్న విని మందహాసము చేసి "బాలా! ఇట్టి ప్రశ్నలవలన నీకుఁ బ్రయోజన మేమి? వినకుతూహలము గలదేని తెలుపుచున్నా నాకర్ణింపుమని యిట్లు చెప్ప నారంభించెను.



# నవమ విలాసము

దేవలోకంబున "శ్వేతకేతు" వను మహామునీం ద్రుఁడు గలఁడు. ఆ మహాత్ముఁ డొకనాఁడు దేవతారాధ నమునకై తామరపూలు గొనివచ్చుటకు మందాకిని కేగెను. అట్లు చని పుష్పములు గోయుటకై జలములలో దిగిన యమ్మునీంద్రు నాలోకించి కమలవనీవిహారిణి యగు లక్ష్మి మానసము చలించెను. ఆ దేవి కూర్చుండి యుండు పుండరీకమునుండి యొకపుత్రుఁ డుదయించెను. అంత లక్ష్మీదేవి తనబిడ్డ నా శ్వేతకేతువున కర్పించెను. ఆలక్ష్మి శ్వేతకేతుల కుమారుఁడే ఈ మునికుమారుఁడు.

ఇతఁడు సకల కళావిశారదుఁడు. సమస్తగుణ సమ న్వితుఁడు. వీని పేరు పుండరీకుఁడు. ఈతని శ్రవణాగ్ర మున విరాజిల్లుచున్నది పారిజాత కుసుమమంజరి. దీని సుగంధమే నిన్నాకర్షించినది. నేఁడు చతుర్దశి యగుటచే మేమిరువురము భగవంతుఁడగు పరమశివుని సందర్శనా ర్థమై కైలాసమునకుఁ బ్రయాణమైతిమి.

నందనవన సమీపమున నాతోఁగూడ నడచివచ్చు చున్న పుండరీకునకు వనదేవత ఈ పారిజాత కుసుమ మంజరిని బహూకరించి "ఆర్యా! ఇదిగో! ఈపారిజాత

మంజరిని బరిగ్రహింపుము. ఈయది నీ రూపమున కను రూప మగు నలంకారము. దీనిని నీ శ్రవణమున ధరిం పుము. పారిజాతము జన్మ సఫలమగును."

అని నందనవన దేవత యెంత బ్రతిమాలినను దానిని గ్రహించుటకు నామిత్రుఁ డంగీకరింపలేదు. అంత నేను పారిజాతమంజరిని బలాత్కారముగ నాతని చెవియం దుంచితిని." అని కపింజలుఁడు పలుకుచుండ నా శ్వేత కేతు కుమారుఁడు నన్నుఁజూచి "కుతూహలినీ! ఈ పారిజాత పరిమళము నీ కిష్ట మగునేని దీనిని నీవే పరిగ్రహింపు" మని యా ప్రసూనమంజరిని తన చెవినుండితీసి నా చెవియం దుంచెను. ఆ మునికుమారుని యంగుళీస్పర్శచే నామేను పులకించెను. హృదయము పరవశమయ్యెను. ఆతఁడును నాకపోలస్పర్శచే కంపితమగు కరాగ్రమునుండి క్రిందఁ బడిన యక్షమాలను స్మైతముగు ర్తింపఁడయ్యెను. అప్పుడు నేను క్రిందఁబడకుండ నా జపమాలికను గైకొని కంఠా భరణముగ నలంకరించుకొంటిని.

ఇంతలో నా ఛత్రగ్రాహిణి చనుదెంచి భర్తృ దారికా! దేవిగారు స్నానము చేసినారు. ఇంటి కేగు సమయము సమీపించినది. నీ స్నానముపూర్తిగానిమ్ము" అని పలుక నే నమ్మునికుమారుని ముఖమునుండి బలా

త్కారముగ చూపు మరల్చుకొని స్నానార్థము సరో వరమున కరిగితిని.

నేను వెడలిపోవుట చూచి రెండవ మునికుమారుఁడు కొంచెము కోపముతో "మిత్రమా! పుండరీకా! నీ కిది తగినపని గాదు. ఈయది క్షుద్రజనులు త్రొక్కవలసిన మార్గము. నీ ధైర్యమెటు పోయినది? నీ యింద్రియ నిగ్రహ మే మూలదాగినది? పరంపరాగత మగు బ్రహ్మ చర్య మెచ్చటి కేగినది? గురూపదేశము లేమి చేసితివి? చదివిన శాస్త్రము లేగంగలో గలిపితివి? చేతినుండి జాఱిపడిన యక్షమాల యపహరింపఁబడుటనైనఁ దెలియం గనైతివి. ఈ బాల జపమాల నపహరించుటఁగాక. నీ హృదయమునుగూడ నపహరించినట్లున్నది. దానినైన మరల గ్రహింపలేకుంటివి" అని మందలింప నామునినం దనుఁ డొక్కింత సిగ్గువడి "కపింజలా! న న్నన్యథాతలం పకుము. ఈ కన్యక యపరాధమును క్షమింపఁబో" నని పలికి, లేని కోపము తెచ్చుకొని నన్నుఁ గనుంగొని "చపలురాలా! నాజపమాల నపహరించితివా? నా యక్షమాల నొసంగక యొక్కయడుగైన ముందున కిడవల" దని నొక్కి పలికెను.

అంత నే నా యక్షమాలను నాకంఠమున నే యుంచు కొని నామెడలోని యేకావళీహారమును దీసి "ఇదిగో

మీయక్షమాలిక ! గ్రహింపు”డని యాతని హస్తమునం దుంచి యటనుండి కదలి మజ్జన మాచరించి మజ్జనని తోఁగూడ నిజభవనమున కేగితిని. అంతఃపురము ప్రవేశించితినే గాని యంతరంగమున న మ్మునికుమారుని యనుపమాన సౌందర్యమునే స్మరించుచుంటిని.

అంత సాయంకాల మయ్యెను. నా ఛత్రగ్రహిణి వచ్చి “రాకుమారీ! ఆపుండరీకుని మిత్రుఁడువచ్చి మన వాకిట నిలబడి యున్నాడు. అక్షమాల నడుగుటకై యరుదెంచితి నని పలుకుచున్నాఁడు” అనిన విని నేను వెను వెంటనే కంచుకి నొక్కని బిలిచి యా మునికుమారుని లోనికిఁ గొనిరమ్మని యాజ్ఞాపించితిని.

అంత కపింజలుఁడు నా చెంత కరుదెంచి యుపవిష్టుఁడై యేకాంతమున నాతో నిట్లుపలికెను. “రాజపుత్రీ! ఏమి చెప్పుదును. నోరాడుట లేదు. వనములలో కందమూలములు భుజించి కాలముగడుపు మునిజన మెక్కడ! కలుషములగు కామవాంఛ లెక్కడ! నీ సమక్షమున నేనట్లు కఠినముగఁ బలికి వేఱొక చోటి కేగితిని. నా మిత్రుఁ డేమి చేయుచుండెనో చూతమని మరలివచ్చి యొక వృక్షము చాటున నిలిచి యాలోకించితిని. నామిత్రుఁడు సర్వ వ్యాపారములు బరిత్యజించియున్నట్టుని వలె పర్యాయత్త చిత్తుఁడై కన్నీరుగార్చుచుఁ గాన్పించెను. అట్టి దీనస్థితిలో

నున్న యాతనిం గాంచి నా హృదయము కంపించినది. అప్పుడు మా కిట్లు సంభాషణ జరిగినది.

"మిత్రమా! పుండరీకా! ఇదియేమి?"

"సఖా! కపింజలా! అంతయు నెఱిగియు నన్నుఁ బ్రశ్నింతువేల!

"వయస్యా! నీ కీ పిచ్చియేమి? ఈ మార్గము గురువు లుపదేశించినదా! ధర్మ గ్రంథములందు పఠించినదా! తపోవిధానమా! వ్రతరహస్యమా! నీవంటి వాఁడు సాధు జన నింధితము లైన యిట్టి విషయముల నాలోచింప నచ్చునా? ధైర్య మవలంబింపుము. దురాలోచనమును దూర మొనరింపుము."

"కపింజలా! నా మనస్సు నాలో లేదు. నీ యుపదేశము నా చెవి కెక్కుటలేదు. నే నందుల కర్హుఁడనుగాను. నన్ను క్షమింపుము."

ఇట్లు పలుకుచున్న నామిత్రుని వాక్యము లాకర్ణించి కింకర్తవ్యమూఢుఁడనై యెవ్విధమునైన ప్రాణమిత్రుని ప్రాణరక్షణమును గావించి తీరవలయు నని నిశ్చయించు కొని యిచ్చటి కరుదెంచితిని. ఇందులకు నీ సందర్శనము దప్ప వేఱుపాయంబు లేదు.

గంధర్వరాజపుత్రీ! కాల మతిక్రమించినది. సూర్య భగవానుఁ డస్తమించుచున్నాఁడు. సుహృత్ప్రాణ సంరక్షణార్థము ప్రాంజలినై ప్రార్థించుచున్నవాఁడను" అని పలికి కపింజలు డటనుండి వెడలి పోయెను.

అంత నాకేమియు తోఁచలేదు. నా ప్రియసఖియగు తరళికతో నిట్లు పలికితిని. "చెలీ! కపింజలుని మాటలు వింటివిగదా! ఇప్పుడు కర్తవ్యము నాలోచింపుము. నేను సామాన్య కన్యవలె లజ్జను పరిత్యజించి, జనాప వాదమునకు సందేహింపక, జననీ జనకుల కెఱింగింపక స్వేచ్ఛగా పోయి యా మునికుమారుని పాణిపద్మము గ్రహించితి నేని గురుజనాతిక్రమణదోషము ప్రాప్తించును. ధర్మమునకు వెఱచి పోకుంటి నేని మానినందనుఁడు ప్రాణములు పరిత్యజించుట నిక్కువము. అందుచే మహా పాతకము ప్రాప్తించును. ఏమిచేయుదు"నని యేడ్చు చున్న నన్ను నాసఖి యూరడించి యుచితవాక్యములచే నాహృదయమున నుత్సాహమును గలిగించినది.

అంత నేను ధైర్యమువహించి మునికుమారుని యంతి కమున కరుగ నిశ్చయించితిని. అంతలో దుర్నిమిత్తము సూచకముగ నాదక్షిణనేత్ర మదరినది. ఆ యపశకునము నకు "దైవమింకను నేమి చేయసంకల్పించెనో" యని శంకించుచు మేలిముసుగుచే నొడలంతయు గప్పుకొని

రహస్యముగ తరళికతోఁగూడి మేడఁదిగి ప్రమదావన ద్వారమున బయలుదేరి పుండరీకుని సమీపమునకుఁ బోయితిని.

అది నిశీథ సమయము. అంతలో దూరము నుండి "హా! హతుఁడనైతిని. వంచితుఁడనైతిని" అయ్యో! ఇదియేమి? ఇంతఘోరము జరిగినదేమి? ఓమహాశ్వేతా! నీకు నామిత్రుఁడు చేసిన యపకారమేమి? అయ్యో! పుండరీకుఁడా! నేను కూడ నీ వెనువెంట వచ్చెదను. నిన్ను వీడి క్షణమైననొంటరిగ నిలునఁజాల." నను కపింజలుని యార్తనాదము నాలకించితిని.

అదివిని నాప్రాణములు లేచిపోయినవి. అడుగులు తడబడినవి. నేనుబిట్టు వాపోవుచు ముందున కరిగి యచ్చట విగతజీవుఁడై పడియున్న పుండరీకుని, విలపించుచున్న కపింజలుని గాంచి దుఃఖావేశమున మూర్ఛనొందితిని! అనంతరము తెలివి తెచ్చుకొని "హా! మహాభాగ! నన్నొంటిగ విడిచి యెందు బోయితి" వని గొంతెత్తి వాపోయితిని.

ఇట్లు కొంత తడవు దుఃఖించి తరళికతో "సఖీ! లెమ్మ! చితి నమర్చుము! జీవితేశ్వరు ననుసరించెద" నని పలుకుచుండ నింతలో నొక దివ్యపురుషుఁడు చంద్ర

మండలమునుండి వెడలివచ్చి పుండరీకుని దేహము నెత్తు కొని గంభీర మగు స్వరముతో న న్నుద్దేశించి "కుమారీ! మహాశ్వేతా! నీవు ప్రాణంబులఁ బరిత్యజింపకుము, వెండియు నీ కీతనితో సమాగమము సంప్రాప్తమగును." అని నన్నోదార్చి యాకసమున కెగసెను.

అంతట నేను విస్మయముతో నిదేమని కపింజలుని ప్రశ్నించితిని. ఆతఁడు నామాటలకుఁ బ్రత్యుత్తర మీయకయే "ఓరీ దురాత్ముఁడా! నా నెచ్చెలికాని నెచ్చటికిఁ దీసికొనిపోదు" వని పలికి కోపావేశముతో నుత్తరీయమును నడుమునకుఁ జుట్టుకొని యాతని వెనువెంట గగన మండలమున కెగిరెను. చూచుచుండగనే వారు నక్షత్ర మండలమునఁ బ్రవేశించిరి.

నా కేమియు దోఁచక విస్మయవిభ్రాంతనై తరళికా! ఇది యంతయు నేమని పలికితిని. తరళికయు సకరుణ ముగా నిట్లు సమాధాన మిచ్చెను. "రాజకుమారీ! శోకింపకుము. ఆ దివ్య పురుషుఁ డెవ్వఁడో కన్నతండ్రి వలె నిన్నోదార్చినాఁడు. అట్టి మహాత్ముల మాట లసత్యములు కావు. కపింజలుఁ డాతని ననుసరించి పోవుటయుఁ గొంత యూశావహముగ నున్నది. అతనివలన నాదివ్య పురుషుఁ డెవ్వండో, ఎందుండి వచ్చెనో, పుండరీకు నేల గొనిపోయెనో, ఏల నిన్నోదార్చెనో, తెలిసికొని యనం

తరము జీవించుటయో, మరణించుటయో తేల్చుకొన వచ్చును. కావున కపింజలుఁడు వచ్చునందాక ప్రాణములు భరింపు"మని తరళిక నాపాదములమీఁద వ్రాలి ప్రార్థించినది.

నేను తరళిక మాటల నాలించి ఆశాబంధము త్రెంపనేరక అప్పటి కదియే యుక్తంబని యెంచి జీవితము త్యజింపనైతిని. తరళికతో నచ్ఛసరోవరతీరంబున ఘోరమగు నా రాత్రి గడపితిని.

మఱునాఁడు ప్రత్యూషముననే లేచి యా సరోవరములో స్నానమొనర్చి మునినందనుని, యందుఁ గల యనురాగాతిశయముచే నాతని కమండలువే, ఆతని నారచీరలే, ఆతని యక్షమాలికయే గ్రహించి సంసారము నిస్సారమని భావించి తల్లిదండ్రులను చుట్టపక్కములను విడిచి బ్రహ్మచర్య మవలంబించి యనాథశరణ్యుండగు పరమేశ్వరుని ప్రతిదిన మర్చించుచు నిందేయుంటిని.

నేనిట్టి పాపాత్మురాలను. నన్నుఁజూచినను, పలుకరించినను మహాభాగునకుఁ బ్రయోజన మేమి?" అని పలికి వల్కలాంచలముచే మోము గప్పుకొని పొంగి వచ్చు శోక మాపుకొనలేక మహాశ్వేత పెద్దయెలుంగున వాపోయెను.

చంద్రాపీడుఁడు మహాశ్వేత వృత్తాంతము విని దయార్ద్రహృదయముతో నామె నిట్లోదార్చెను. "భగవతీ! విచారింపకుము. సుఖములును, కష్టములును వచ్చుచుఁబోవుచుండును. ధైర్యము వహింపుము. మరణించిన వారికై పరితపించుట భావ్యము కాదు. మనోనాథుడగు మన్మథుఁడు మహాదేవుని నయనాగ్నియందు భస్మమై పోయిన రతి ప్రాణములు వాసినదా! పద్మవ్యూహమున ప్రాణములు గోల్పోయిన యభిమన్యుని విడిచి యుత్తర జీవితము భరింపలేదా! నీకు మరల భర్తృ సమాగమ భాగ్యము గల్గునని యా దివ్యపురుషుడు వచించె నంటివి గదా! మహానుభావుల వాక్యముల వ్యర్థములు కావు. ఆపదలయందు ధైర్యము ధీరుల లక్షణము" అని పెక్కు విధముల నూరార్చుచుండునంతలో నామె విషాద వృత్తాంతము విని చింతాక్రాంతుఁడయ్యెనో యన సహస్కరుఁడ స్తమించెను. అంత మహాశ్వేతాచంద్రాపీడులు సాయంసంధ్యోపాసనకై లేచిరి.



# దశమ విలాసము

అనంతరము చంద్రాపీడుఁడు మాటిమాటికి మహా శ్వేత చరిత్రమును దలంచుకొనుచు, మరల నామెతో నిట్లనియెను. "భగవతీ! నీ ప్రాణసఖియగు తరళిక యెందే గినది ? అనుటయు మహాశ్వేత చంద్రాపీడునితో నిట్లు వచింపసాగెను.

"ఆర్యా! వింటిరిగదా స్వర్గలోకమున పదునాలు గప్సరఃకులములు గలవని. అందు నమృత సంభవమైన కులమున "మదిర" యను కన్యకామణి జన్మించెను. గంధర్వరాజగు చిత్రరథుఁ డామెను పరిణయమాడెను. ఆ దంపతులకుఁ "గాదంబరి" యను పుత్రిక జన్మించినది. ఆమె బాల్యమాదిగా నాకుఁ బ్రాణసఖి యైనది. ఇరు వురము నొక కంచమునఁ దిని యొక మంచమున బండు కొంటిమి. ఆకాంత విషాదాంత మగు నావృత్తాంతము నాలకించి "నాప్రియసఖి యగు మహాశ్వేత విరహావిధు రయై దుఃఖించుచుండగా నేను వివాహ మాడను." అని శపథము చేసినది. "నాతండ్రి బలవంతముగా పరి ణయము చేసినఁ బ్రాణములు విసర్జింతు" నని ప్రతిజ్ఞ పూనినది. అది విని గంధర్వరాజగు చిత్రరథుఁడు

"మహాశ్వేతా! నీకై దుఃఖించుచున్న మాకు మఱియొక దుఃఖము సంప్రాప్తమైనది. నీసఖియగు కాదంబరి కళ్యాణము చేసికొననని గట్టిపట్టుపట్టినది. నీప్రాణసఖికి నీవే యొకింత బోధింపు"మని నా చెంతకుఁ గంచుకి నొకనిని బంపించెను.

అప్పుడు నేను "సఖి! కాదంబరీ! దుఃఖించుచున్న నాకు మఱింత దుఃఖము గలుగఁజేయకుము. నాస్వాంతమునకు సంతోషము కలిగించుటయే నీ కభీష్టమేని నామాట మన్నించి వివాహమును చేసికొనుము" అని నామాటలుగాఁ జెప్పుమని నాసఖి యగు తరళికను కాదంబరి యొద్ద కంపితిని. అదిపోయిన కొంచెము సేపునకే మీరరుదెంచితిరి."

మహాశ్వేత యిట్లు పలుకుచుండగా చంద్రోదయమైనది. అంత నామె మెల్లగా నిద్రించినది. రాజకుమారుఁడును "నా మిత్రుఁడు వైశంపాయనుఁడు నా కొఱకెంత చింతించుచున్నాఁడో, పాపము! పత్రలేఖ యేమని భావించుచున్నదో! నా సహచరు లగు రాజపుత్రు లేమి చేయుచున్నారో" అని ధ్యానించుచునే నిదురించెను.

మఱునాఁడు "కేయూరకుఁ" డను గంధర్వ కుమారునితోఁగూడి తరళిక యచ్చటికి వచ్చెను. మహాశ్వేత

తరళికను గాంచి "సఖీ! గంధర్వరాజకుమారి కాదంబరి సుఖముగా నున్నదా! నా మాటలు వచించితివా! సమ్మతించినదా!" యని ప్రశ్నించెను. తరళిక "రాకు మారీ! కాదంబరి సుఖముగా నున్నది. నీ సందేశ మంతయు విన్నది. ఆమె ముక్తకంఠముతో విలపించి తన వీణా వాహకుఁడగు నీ కేయూరకుని నీచెంత కంపి నది"అని పలికెను.

అంతట కేయూరకుఁడు మహాశ్వేతతో నిట్లు మనవి చేసికొనెను. "దేవీ! కాదంబరీదేవి నీ కిట్లు విన్నవించు చున్నది. నీవు తరళికచే నట్లు వర్తమానము మంపుట నా చిత్తమును పరీక్షించుటకా! లేక నామీఁదకోపమా! నాహృదయము నీ వెఱుంగవా! మధురభాషిణి వగు నీ నోటినుండి యింతటి కఠినవాక్యము లెట్లువచ్చినవి? ప్రాణ సమానురాలగు నాసఖురాలుపతివియోగమున దుఃఖించు చుండ నేను వివాహమాడుటయా! నీకు నమస్కరించు చున్నాను. నన్ను బలవంతము చేయకుము. అన్యథా భావింపకుము. కరుణింపుము. అని మీతో నొక్కి వక్కాణింపు మని నన్నుఁ బంపినది" ఆ మాటలు విని మహాశ్వేత కొంతసే పాలోచించి కేయూరకుని బంపివేసి చంద్రాపీడుని గాంచి "రాజకుమారా! హేమకూటము మిక్కిలి రమణీయమైనది. చిత్రరథుని రాజధానియు

మిక్కిలి చిత్రమైనది గంధర్వలోకము కడుంగడు మనో హరము. కాదంబరి సరళహృదయ. నే నిప్పు డచ్చటికిం బోవలసియున్నది. నీ కెట్టి యాటంకము లేనిచో నావెంట దయచేయుము. హేమకూటంబునకు వచ్చి నాసఖి యగు కాదంబరిని గనుంగొని మరల రావచ్చును. నీవు నా కకారణబాంధవుఁడ వైతివి. నీ సందర్శనముచే చింతా క్రాంత మగు నాస్వాంతమున కెంతేని శాంతి కలిగినది. సజ్జన సమాగమములు సంతోషదాయకములుగదా!" యని పలికిన చంద్రాపీడుఁడు "దేవీ! నిన్నుగాంచినది మొదలు నాకును నేదియో యుత్సాహము పొంగి పొరలుచున్నది. నీ యాజ్ఞ శిరసావహించెద" నని పలికి యామెవెంట బయలుదేరెను.

అట్లు మహాశ్వేత చంద్రాపీడునితోఁగూడి హేమ కూటంబున కేగి గంధర్వ రాజధానిని ప్రవేశించి కాదం బరీసౌధమున కరిగినది. అల్లంత దూరమునుండియే తన్నుఁగాంచి తల్పము దిగివచ్చుచున్న కాదంబరిని గాగిలించుకొని మహాశ్వేత "సఖీ! ఈతఁడు చంద్రా పీడుఁ డను రాజకుమారుఁడు. భారతవర్షమునకుఁ బ్రభు వగు తారాపీడమహారాజుతనయుఁడు. దిగ్విజయమునకై బయలుదేరి మార్గవశమున మనభూమి కేతెంచినాఁడు.

ప్రథమదర్శనమునందే నాకీతనియం దత్యంత గౌరవమేర్ప డినది. మనకీతఁడు పరమమిత్రుఁడు." అని పలికెను.

అంత చంద్రాపీడుఁడు కాదంబరికి వందన మాచరించెను. కాదంబరియు రాజకుమారునికి గౌరవ పురస్సరముగా మరల నమస్కరించి యుచితాసనమున నుపవిష్టుంగావించి రాజోచితము లగు సత్కారములతో సన్మానించెను. అనంతరము మహాశ్వేత కాదంబరీ సౌధమునకు సమీపమందున్న ప్రమదావనములోని విలాసభవనములో రాకుమారునకు విడిది యేర్పఱచి గంధర్వసార్వభౌముని దర్శింపఁబోయినది. చంద్రాపీడుఁడు రెండవ కాదంబరీ హృదయమువలె నున్న యమ్మణియ భవనమును బ్రవేశించి స్నానాది నిత్యకృత్యంబుల నిర్వర్తించెను. అంతలో మదలేఖయను పరిచారిక మాలతీ కుసుమమాలికలను, నొక మనోహరమగుమణిమయ హారమును గొనివచ్చి చంద్రాపీడునకు సమర్పించి "రాజకుమారా! కాదంబరీదేవి వీనిని మీకుఁగానుకగాఁ బంపినది. ఈ రత్నహారము క్షీరసముద్రమున నుద్భవించినది. దీనిని సముద్రుఁడు వరుణున కిచ్చెను. వరుణుఁడు గంధర్వరాజున కొసంగెను. ఆతఁడు కాదంబరికి బహూకరించెను. ఆమె మీకు సమర్పించినది."

అంతట చంద్రాపీడుఁ డాదరపూర్వకముగా నా హార మును గ్రహించి కాదంబరి సుగుణములను గొనియాడి సబహుమానముగ మదలేఖను వీడ్కొల్పెను. మఱు నాఁడు ప్రాతఃకాలమున రాజనందనుఁడు కాదంబరీమందిర మున కరిగి యందు కాదంబరితో మాటాడుచున్న మహాశ్వేత వైపుఁజూచి మందహాసము చేసెను.

మహాశ్వేతయు రాజకుమారుని భావమును గుర్తించి "చెలీ! కాదంబరీ! చంద్రకిరణములచే చంద్రకాంతమణి వలె నీగుణములచే నార్ద్రీకృతహృదయుఁడైన చంద్రా పీడుఁడు వెడలిపోదలచుచున్నాఁడు. పాప మీయువరాజు వృత్తాంత మేమియుం దెలియక రాజచక్ర మీపాటికి తొట్రువడుచుండును. ఎంతదూరమం దున్నను పద్మినీ పద్మబాంధవులకు వలె, కుముదినీ కుముదప్రియులకువలె మీ కన్యోన్యప్రీతి జీవితాంతము నిలిచియుండుఁగాక!" అని పలికెను. కాదంబరి గంధర్వకుమారులం బిలిచి ఈరాజనందనుని స్కంధావారముం జేర్చిరండని యాజ్ఞా పించి పంపినది.

అనంతరము చంద్రాపీడుఁడు మహాశ్వేతకును కాదం బరికిని నభినందనము లొనర్చి హేమకూటంబు వెలువడి, మహాశ్వేతాశ్రమమున కరుదెంచి, తన స్కంధావార మునుజేరి గంధర్వకుమారులను బంపివేసెను.

రాజకుమారుఁడు తనకు నమస్కరించుచున్న రాజలోకమును మన్నించి యెదురువచ్చిన వైశంపాయను నాలింగనముఁ జేసికొని పత్రలేఖ నాదరించి తానుజూచి వచ్చిన విశేషము లన్నియు వారలకుఁ జెప్పుచునా రాత్రి గడపెను.

మఱునాఁడు చంద్రాపీడుఁడు సభాభవనమలంకరించి కాదంబరీ మగ్నమానసుఁడై యుండ నంతలో కేయూరకుఁడచ్చటి కరుదెంచెను. రాజకుమారుఁ డా గంధర్వ పుత్రుని గౌరవించి కాదంబరీమహాశ్వేతల క్షేమ మడిగెను. ఆతఁడును కాదంబరి పంపిన కర్పూరతాంబూలమును కమలదళ సంపుటమునుండి తీసి చంద్రాపీడున కొసంగి మా రాజకుమారి మీరర్పించిన మణిహారము నచ్చటనే పర్యంకముపై మఱచి వచ్చితి రని యుత్తరీయాంచలమున బంధింపఁబడియున్న మణిహారమును సమర్పించెను.

అంత చంద్రాపీడుఁడు కేయూరకునితో నేకాంతముగ సంభాషించి కాదంబరి తన వియోగముచే క్రుంగి కృశించిపోవుచున్న దని విని ససంభ్రమముగ నింద్రాయుధమును దెప్పించి దాని నధిష్ఠించి పత్రలేఖను వెంటబెట్టుకొని హేమకూటమున కరిగెను. అందు సఖీజనులు

శిశిరోపచారములు చేయ కృశీభూతశరీరయై యున్న గంధర్వరాజపుత్రిని సందర్శించెను.

కాదంబరికి రాజకుమారు నాగమనంబుచే ప్రాణంబులు లేచివచ్చినవి. అనంతరము కొంతకాల మన్యోన్య విస్రంభ సంభాషణములచేఁ గడిపి కాదంబరి పట్టుబట్టుటచే పత్రలేఖ నామెచెంత నుంచి చంద్రాపీడుఁడు మఱల తన సేనానివేశమున కేతెంచెను.



# ఏకాదశ విలాసము

చంద్రాపీడుఁడు స్కంధావారమునకు వచ్చినంతనే ఉజ్జయినినుండి వచ్చిన రాజదూత సిద్ధముగ నుండెను. వానింజూచి రాజకుమారుఁడు "ఓయీ! మాతల్లిదండ్రులు క్షేమముగ నున్నారా? ప్రజలకు కుశలమేగదా!" అనిన వాఁడు నమస్కరించి యువరాజా! "అచ్చట నందఱికిని కుశలమే" యని మహారాజుగారంపిన లేఖ నందించెను.

చంద్రాపీడు డాలేఖనుపఠించి తనరాకకై జననీ జనకులు వేయికన్నులతో నెదురు చూచుచున్నారని గ్రహించి ప్రయాణభేరి మ్రోగించెను. మఱియు మేఘనాథుఁడను తన సేనానాయకుని బిలిచి "గంధర్వ నగరమునుండి కేయూరకుం డిచ్చటికి పత్రలేఖను దోడ్కొని వచ్చును. నీ వామెను వెంటఁబెట్టుకొని మన పట్టణమునకుఁ గొనిరమ్ము! అని యానతిచ్చి సైన్యంబులను కష్టపెట్టక మెల్లమెల్లగా నడిపించుకొని రమ్మని వైశంపాయనుని స్కంధావారమున నిలిపి యింద్రాయుధము నెక్కి కొంతయశ్వసైన్యమును వెంటబెట్టుకొని సత్వరగమనమున నుజ్జయిని కేగెను.

అట్లు చంద్రాపీడుఁడు పట్టణము ప్రవేశించి జననీ జనకులకు సమస్కరించి మనోరమాశుకనాసులసందర్శించి వైశంపాయనుఁడు స్కంధావారముతో వచ్చుచున్నాఁడని తెలిపి తన భవనంబునకేగి కాదంబరిని స్మరించుకొనుచు కొన్ని దినములు గడపెను. ఇంతలో మేఘనాధుఁడు పత్రలేఖను దోడ్కొని రాగా యామెవలన కాదంబరీ చరిత్ర మంతయుఁ దెలిసికొని అమెహృదయందు గల నిష్కల్మషమైన ప్రేమను గ్రహించి, గంధర్వరాజ పుత్రిపంపిన యనురాగసందేశము నాలకించుచున్నంతలో ప్రతీహారి చనుదెంచి "యువరాజా! కేయూరకుండను వాఁడు తమ దర్శనార్థమై వచ్చి వాకిటనిలచియున్నాఁ" డని వచించెను.

అంత చంద్రాపీడుఁడు కేయూరకుని లోనికి పిలిపించుకొని "కాదంబరీ మహాశ్వేత లెట్లున్నారు? వారి సందేశ మెఱింగింపు"మని యడిగెను. కేయూరకుండు "రాజకుమారా! నేను పత్రలేఖను మేఘనాధుని యొద్ద వదలి మఱల హేమకూటంబునకరిగి యువరాజుగా రుజ్జయిని కేగినా"రని కాదంబరీ దేవి కెఱింగించితిని. ఆమాట విని కాదంబరి నిరాశురాలై నిర్ఘాంత పోయినది. మహాశ్వేత నిట్టూర్పువుచ్చి తనయాశ్రమంబున కేగినది. హేమకూటమునందందఱు నీరాకకై నిరీక్షించుచున్నారు. సత్వరము

గనుదెంచి మా రాజకుమారుని రక్షింపు” మని పలుకు టయు చంద్రాపీడుఁడు కేయూరకుని జూచి “గంధర్వ కుమారా ! అచిరకాలములో నే నామెను దర్శింపఁగల నని వచింపుము. పత్రలేఖను నీవెంటఁ గొనిపొమ్ము. దేవికి నా యాగమనవార్త దెలిపి మఱల నీవు మహా శ్వేతాశ్రమమున కేతెంచి నన్ను గలిసికొ” మ్మని పలికి పత్రలేఖతో వానిని పంపివేసెను. తరువాత రాజకుమా రుఁడు కాదంబరీ దర్శనమునకై గంధర్వనగరమున కేగు నుపాయ మేదా యనియు, తలిదండ్రుల కేమి చెప్పి వెడలుదునా యనియు, సేనలతోను, రాజసమూహము తోను, వైశంపాయనుడింకను రాలేదేమా యనియు పరి పరివిధముల చింతించుచుండ నారాత్రి గతించినది.

తెల్లవారినది. స్కంధావారము సమీపమున కరు దెంచినదని వార్త వచ్చినది. ప్రాణసమానుఁడగు వైశం పాయనుఁడు వచ్చుచున్నాఁడుగదా యని చంద్రాపీడుని హృదయము హర్ష ప్రఫుల్లమైనది.

రాజకుమారుఁడు మహారాజుననుజ్ఞ వడసి వైశంపా యను నెదుర్కొనుటకై యింద్రాయుధము నెక్కి కొంత యశ్వసైన్యముతో నుజ్జయిని వెలువడి స్కంధావార మున కెదురుపోయెను. అట్లు పోయి సేనాసమూహ మందలి రాజచక్రములో వైశంపాయనుని గానక

"మంత్రినందనుఁ డెక్కడ" అని వారిని ప్రశ్నించెను. అంత సంతాపసూచకములగు ముఖములతో వారు చంద్రాపీడున కిట్లనిరి.

"యువరాజా! జరిగిన సంగతి విన్నవింతుము మాకర్ణింపుఁడు. మెల్లమెల్లఁగ సేనలతో నేతెంచుమని వైశంపాయనున కనుజ్ఞయిడి మీరు వెడలితిరి. మఱునాఁడు నేము మందఱము ప్రయాణాభిముఖులమై యుండ వైశంపాయనుఁడు వచ్చి "ఈ ప్రాంతమున నచ్ఛోదమను సరోవరము కలదు. అది పురాణప్రసిద్ధ మయిన పుణ్యతీర్థము. ఆ సరోవరములో స్నానముచేసి దానితీరమున నున్న భగవంతుఁడగు పరమశివునకు నమస్కరించి పోవుద" మని పలికెను.

ఇట్లు పలికి కాలినడకతో మంత్రికుమారుఁ డా సరోవర సమీపమున కేగెను. అత్యంతసుందర మగు నా ప్రదేశము నవలోకించుచు నతఁ డందున్న యొక లతామండపమువైపు ఱెప్పవేయక యట్టె చూడసాగెను. నయనాంచలముల బాష్పబిందువులు జాలువాఱ లోలోపల నేనేమియో ధ్యానించుచు కదలక మెదలక వంచినతల యెత్తక యట్లే గూర్చుండియున్న వైశంపాయనుని జూచి చిత్తచాంచల్యము సంభవించెనని

తలంచితిమి. సమీపమునకుపోయి రమ్మని బ్రతిమాలి తిమి. బలవంత పెట్టితిమి.

కాని మామాటలను మంత్రినందనుఁడు వినిపించుకొనక "నే నిచ్చోటు విడిచి రాలేను. మీరు సైన్యములను దోడ్కొని నగరమునకు పొండు. నన్ను నిర్బంధింపకుఁడు. నాపాదములు బంధింపఁబడినట్లున్నవి" అని పలికెను. మేము కారణమేమో తెలిసికొందమని గ్రుచ్చి గ్రుచ్చి యెన్నియో విధములఁ బ్రశ్నించితిమి కాని యేమియును లాభము లేకపోయెను."

అని స్కంధావారమునందలి రాజచక్రము విన్నవింప రాజకుమారుఁడు వైశంపాయనున కిట్టి వైరాగ్యము గల్గుటకు హేతు వేమా యని చింతించుచు చమూసమూహములతో నుజ్జయినీ నగరముఁ బ్రవేశించెను.

వైశంపాయనుని వృత్తాంతము పట్టణమంతయుఁ బ్రాకినది. జనులందఱు గుంపులుగూడి యీ వింతవార్త చెప్పుకొని విచారింపసాగిరి. ఆ విషాదవార్త నాలకించి మనోరమ కన్నీరు మున్నీరుగా విలపించినది.

చంద్రాపీడుఁడు లజ్జావనత ముఖముతో మహారాజునకు నమస్కరించెను. తారాపీడుఁడు కుమారుని జూచి "వత్సా! వైశంపాయనుఁడు నీకుఁ బ్రాణాధికుఁడగు

పరమమిత్రుఁడని భావించుచుంటిని. ఇప్పు డీ వృత్తాం తము విన నాస్వాంతము నీయందు దోషమును శంకించు చున్నది" అని పలికెను. వెంటనే శుకనాసుం డందుకొని "మహారాజా! సద్గుణనిధి యగు చంద్రాపీడుని మీ రిట్లు శంకింపవలదు. ఈ యపరాధమంతయు వైశంపాయ నుని దే. దుస్స్వభావుఁడైన వానిని రాజకుమారుఁడు మాత్ర మేమిచేయును?" అని పలికెను.



# ద్వాదశ విలాసము

అంత చంద్రాపీడుఁడు జననీ జనకులకు నమస్కరించి వారి యనుజ్ఞ గైకొని వైశంపాయనుని దీసికొనివచ్చి టక్కై సముచిత పరివారమును వెంటనిడుకొని యింద్రాయుధము నధిరోహించి మహాశ్వేత తపోవనమునకు బయలు దేరెను.

ఇట్లు రాజనందనుఁడు సిద్ధాయతనమున కేగి సైన్యము నంతయు దూరమున నిలిపి తానొక్కఁడ యాశ్రమములోని కేగి మహా తను దర్శించెను. అచ్చట నశ్రుధారలు గార్చుచు గూర్చుండియున్న మహాశ్వేతను జూచి "యిదియే" మని తరళికను బ్రశ్నింప నది మహాశ్వేత ముఖ మాలోకించెను. అంత నామె గద్గద కంఠముతో రాజకుమారున కిట్లనియెను.

"రాజకుమారా! నీ వుజ్జయిని కేగితి వని విని కాదంబరీ మనోరథము విఫలమైపోవుటకు విచారించి వైరాగ్యంబున మరల నీయాశ్రమమునకుఁ జనుదెంచితిని. ఇచ్చట నిన్నుఁ బోలియున్న యొక బ్రాహ్మణకుమారు నవలోకించితిని. అత డేదియో స్మరించువానివలె తదేక దృష్టితో నన్నుఁ జూచి "తలోదరీ! నీవంటి సౌందర్యవతి

మైహికసుఖంబుల నిరసించి శరీరము నాయాసపఱచుట ధర్మమా" అని పలికెను. అందులకు నే నేమియుఁ బ్రత్యుత్తరమీయక వాని నేమియుఁ బ్రశ్నింపక తొలగిపోయితిని.

మఱల నొక నాఁడా విప్రకుమారుఁడు నాసమీపమునకు వచ్చెను. నే నా సమయమున నా హృదయేశ్వరుఁడగు పుండరీకుని ధ్యానించుచుఁ బండుకొనియుంటిని. అంతట వాఁడు నన్ను సమీపించి నేను "నిన్ను బ్రేమించితిని. నన్ను కృతార్థుని జేయుమని యేమేమో పలికెను. నేను వాని మాటలువిని కన్నుల నగ్నికణములు రాల" దుర్మార్గుఁడా! ఎవ్వరో నేర్పినట్లు చిలుకవలెఁ బల్కుచుంటివి. నన్నిట్లు పల్కుటకు నీకు నోరెట్లు వచ్చినది? ఇట్టి నీచప్రవృత్తి గలిగిన నీవు పక్షి జాతియందుఁ బుట్టక యిట్లేల జన్మించితివి? అనిపలికి చంద్రాభిముఖనై "భగవానుఁడా! నేను నిజముగ పుండరీకుని దప్ప వేఱొకని మనంబునఁ దలంపనైతినేని ఈతఁడు శుకమై పోవుగాక" యని శపించితిని. వెంటనే యాతఁడు నిశ్చేతనుఁడై నేలపైఁబడెను. అనంతరము పరిజనుల యాక్రందన ధ్వనులచే నాతఁడు దేవర ప్రియమిత్రుఁడని తెలిసికొని యిట్లు దుఃఖించుచున్నాను.

అని పలికిన మహాశ్వేత వాక్యములు విని చంద్రాపీడుఁడు నయనములు మూసికొని "భగవతీ! నీ వెంత

ప్రయత్నించినను కాదంబరీ కళ్యాణము మందభాగ్యుండ నైన నాకీ జన్మమున లభింపదయ్యెను. ముందుజన్మమున నైన దాని ననుగ్రహింతువుగాక” అని పలుకుచు గుండెలుబ్రద్దలై యట్లే ప్రాణములు విడిచెను.

అదిగాంచి తరళిక పరుగెత్తుకొనివచ్చి చంద్రాపీడుం బట్టుకొనిచూచి “భర్తృదారికా! ఈతఁడు ప్రాణములు విడిచినట్లున్నది. అయ్యో! ఎంతపని జరిగినది. హా! చంద్రాపీడా! నీ ప్రేమమంతయు నేమైన”దని పెద్ద యెలుఁగున నేడ్వసాగెను. మహాశ్వేత యదంతయుచూచి నిశ్చేష్టురాలయ్యెను. వెంటవచ్చిన రాజపరివారమంతయు “ఓసి! దుష్టతాపసీ! ఎంతపనిచేసితి“ వని మహాశ్వేతను దూరసాగిరి. ఇంద్రాయుధము చంద్రాపీడుని ముఖమండలము వీక్షించుచుఁ నతిదీనముగా సకిలింపసాగినది.

అక్కడ కాదంబరి పత్రలేఖచే రాజకుమారు నాగమనవృత్తాంతము విని సుందరముగా నలంకరించుకొని పత్రలేఖ కై దండ యొసఁగి కొని మదలేఖతోఁగూడ మధుర భాషణము లాలపించుచు మహాశ్వేతాశ్రమమున కరుదెంచినది. అట్లు వచ్చి యచ్చట జరిగిన విషాదవృత్తాంత మంతయుఁ దెలిసికొని మూర్ఛిల్లి కొంత కాలమునకుఁ దెలివొంది మహాశ్వేత నంతమును గాగిలించుకొని

దుఃఖించి మదలేఖయు పత్రలేఖయు దన్నుఁ బెక్కువిధం
బుల నూరడించినను వినక చంద్రాపీడుని చరణకమల
ములకు నమస్కరించి వానిని తన యంకభాగమున నిడు
కొని కూర్చుండెను. కాదంబరీ కరస్పర్శచే నొక దివ్య
తేజము చంద్రాపీడుని శరీరములోనుండి యాకసమున
కేగినది. అప్పు డంతరిక్షమునుండి యిట్లు వినవచ్చినది
"అమ్మా మహాశ్వేతా! పూర్వము నిన్నోదార్చితిని..
పుండరీకుని దేహము నాలోకంబున నున్నది. చంద్రా
పీడుండును కొలఁదికాలములో జీవింపగలఁడు. అంతవరకు
నాతని శరీరమును కాదంబరి రక్షించుగాక!"

ఆ వాక్యము లాలించి యందఱును నాకాశము వైపు
జూచుచుండిరి. అంతలో పత్రలేఖ లేచి త్వరత్వరగా
పరుగిడి యింద్రాయుధము కళ్లెమును బట్టుకొని "ప్రభువు
లేనిచో మన కిచ్చట నేమిపని" యని పలుకుచు నయ్యా
శ్వముతోఁగూడ నచ్ఛోద సరోవరములో దుమికినది.



# త్రయోదశ విలాసము

అంతనా సరోవరమునుండి యొక మునికుమారుఁడు వెడలివచ్చి "మహాశ్వేతా!" యని పిలిచెను. వెంటనే మహాశ్వేత సంభ్రమముతో నాతనికి నమస్కరించి మహాత్మా! కపింజలా! యిప్పటికీ దురదృష్టవంతురాలిపై దయవచ్చినదా! పుండరీక శరీరమెందున్నది? అట్లు గొంపోయిన వారెవ్వరు? నీమిత్రుని నెచ్చటవిడిచి వచ్చితివి? అని యడుగ గపింజలుఁ డిట్లనియె.

గంధర్వ రాజపుత్రీ! అట్లు నామిత్రుని వెన్వెంట చంద్రలోకమున కేగితిని. అచ్చట నొక్కపర్యంకమున పుండరీకుని శరీరముంచి యాదివ్యపురుషుఁడు నాతో నిట్లు పలికెను. "కపింజలా! నేను చంద్రుఁడను. నే నా నాడు విశ్వమంతయు వెన్నెలలు వెదజల్లుచుండ, నీ ప్రియమిత్రుడైన పుండరీకుడు నాకిరణములచే సంతాప మతిశయింప నన్నిట్లు బాధించితివిగావున నీవును భారతవర్షంబున జన్మించి జన్మజన్మకు ననురాగము గలిగియు ప్రియా సమాగమ సుఖ మనుభవింపకయే మృతినొందెదవుగాక" యని నన్ను శపించి మృతుఁ డయ్యెను.

నేనును నిరపరాధినగు నన్నుశపించెనను క్రోధంబున "నీవును నావలెనే కష్టముల ననుభవింతువుగాక" యని తిరిగి శపించితిని. అనంతర మాగ్రహ మడంచుకొని మహాశ్వేత మతి—రణసంజాతమగు నచ్చరల కులమున బుట్టిన "గౌరి" పుత్రికగదా! ఆమెచే వరింపఁబడిన ఈ పుండరీకుఁడు నాకు దగ్గఱ చుట్టమే యగుచున్నాడు. పరస్పరము వ్యర్థముగా శపించుకొంటిమి. జన్మజన్మకు ననుట చే భూలోకమున రెండుసారులైన పుట్టక తప్పదు. శాప దోషము పోవునంతవఱకు నీతని శరీరమును రక్షింప వలయునను తలంపుతో నిచ్చటికి గొనివచ్చితిని. నీవీ వృత్తాంతమును వీని తండ్రియగు శ్వేత కేతువున కెఱింగింపుము. అమ్మహాత్మ్ముం డిందుల కేదేని ప్రతిక్రియ జేయఁగలఁడని పలికి నాకు సెలవొసంగెను.

అప్పుడు నేను చింతాక్రాంత హృదయుఁడనై గగన మార్గమునఁ ద్వరితగతిం జనుచు నొక్క వైమానికు నతిక్రమించితి. వాడునన్ను జుఱచుఱ చూచి "దురాత్మా! గుఱ్ఱమువలె నన్నుల్లంఘించితివి. భూమియందు తురంగమ్మవై పుట్టు మని కఠినముగ శపించెను. అనంతరము నాచే ప్రార్థితుండై నాశాపము తప్పదు నీ వెవ్వనికి వాహన మగుదువో వాని యవసానమున స్నానము చేసినంత శాపముక్తుండ వయ్యెద" వని పలికెను. అంత నేను

"స్వామీ! నామిత్రు డిప్పుడు చంద్రుని తోఁగూడ భూమిపైఁ బుట్టవలసి యున్నది. వారితోఁ గలసి యుండు న ట్లనుగ్రహింపు" మని ప్రార్థింప నాతం డొక్కింత ధ్యానించి "చంద్రుఁడు తారాపీడునకు దనయుండై యుద్భవింపఁగలఁడు. నీ మిత్రుఁడగు పుండరీకు డాతని మంత్రియగు శుకనాసునకుఁ గుమారుఁడగును. నీవా రాజ కుమారునకు వాహన మయ్యెదవు" అనుచుండగనే నేను క్రిందనున్న సముద్రములోఁ బడితిని. అందుండి సైంధవమునై వెడలితిని. ఆ జన్మమున సైతము నాకుఁ బూర్వ జ్ఞానము గలిగియుండుటచే కిన్నర మిథునము వెంటబడి చంద్రాపీడు నిచ్చటికిఁ దీసికొని వచ్చితిని. ఈచంద్రాపీడుఁడు చంద్రుని యవతారము. పూర్వాను రాగముచే ని న్నభిలషించి నీ శాపాగ్నిచే హతుఁడైన వైశంపాయనుఁడే పుండరీకుని యవతారము.

కపింజలుఁడిట్లు పలకి నంత మహాశ్వేత తెలియక తాను గావించిన మహాపరాధంబునకు మిక్కిలి దుఃఖించెను. కపింజలుఁ డామె నోదార్చుచు "అమ్మా! యిందు నీ యపరాధ మేమున్నది? ఇది యంతయు శాప మహిమ" యని పలికెను. అంత కాదంబరి కపింజలునితో "స్వామీ! పత్రలేఖయు, నీవును సరోవరంబునఁ బడితిరి గదా! ఆమె యేమైనదో తెలుపుఁ డన కపింజలుఁడు

"రాజకుమారీ! ఆమె సంగతినాకు తెలియదు. నేనిప్పుడు మహానుభావుడగు శ్వేతకేతుని చెంతకేగి సమస్త వృత్తాంతముల నడిగి తెలిసికొనివత్తు" నని పలికుచు గగనమున కెగసెను.

అనంతరము కాదంబరి మహాశ్వేతచేఁ బ్రబోధింపబడి చంద్రాపీడుని శరీరము నొక్క శిల్లాతలమందుంచి స్నానముచేసి పరిశుద్ధ చిత్తముతో నిత్యము నర్చించుచుండెను.



# చతుర్దశ విలాసము

అనంతరము తారాపీడధరణీకాంతుఁడు తన చారుల వలన నావృత్తాంత మంతయు నాలకించి మిక్కిలి దుఃఖించెను. అంత నామహారాజు విలాసవతీ సహితుఁడై మనోరమా శుకనాసులు తన్ననుసరింప సముచిత పరివారముతో నచ్ఛోదాశ్రమమున కేగెను. ఆ రాజేంద్రుఁడట్లు చని యచ్చట చంద్రాపీడుని దురవస్థకు మిగుల పరితపించి విరక్తుఁడై శాపవృత్తాంతమంతయు వినియుండుటచే నాప్రాంతమం దున్న కాంతారములోఁ దపంబు జేసికొనుచు నప్పు డప్పుడు చంద్రాపీడుని శరీరమును సందర్శించుచు నందే దినములు గడపుచుండెను.

అని యాకథనంతయు చెప్పి జాబాలిమహర్షి పకపక నవ్వి "మునీంద్రులారా! యీకథ యెంత విచిత్రముగా నున్నదో వింటిరా! ప్రస్తుతవిషయము విడిచి చాల దూరము చెప్పుకొని పోయితిని. కామోపహతచేతస్కుఁడగు నాపుండరీకుఁడు స్వయంకృతాపరాధముచే దివ్యలోకమునుండి పరిభ్రష్టుఁడై భూలోకమున వైశంపాయనుఁడై యుద్భవించెను. మరల స్వయంకృతమగు

దోషముననే మహాశ్వేత శాపముచే నిట్లు శుకయోని యందు జన్మించెను.

అని యా జాబాలిమునీంద్రుఁడు పలుకుచుండ నా కప్పుడు జాతిస్మరణ గలిగి నిద్రమేల్కాంచిన ట్లైనది. సమస్త విద్యలును స్మృతికి వచ్చినవి. పరిస్ఫుట మగు వాణి ప్రాప్తించినది. అంత నేనా మునిశేఖరుం గాంచి "స్వామీ! తమ యనుగ్రహముచే పూర్వవృత్తాంత మంతయు స్ఫురణకు వచ్చినది. బంధుమిత్రుల నందఱ స్మరించుకొంటిని. నామరణము నాలకించినంత నేహృదయ మాగిపోయి ప్రాణములు త్యజించిన నా ప్రాణసఖుఁడగు చంద్రాపీడుఁడు జన్మాంతరమున నెచ్చట నేశరీరము ధరించెనో చెప్పి నన్ననుగ్రహింపుఁడు. నేనాతని గలసి కొనఁ గోరుచున్నా నని పలికితిని. నామాటలు విని యమ్ముని కోపముతో "మూర్ఖుఁడా! నీ చంచల స్వభావ మింకను విడువకున్నావు. ఱెక్కలైనను సరిగా రాలేదు! ఎగురుటకు సమర్థుఁడవైనప్పుడు చెప్పెదనులే పొమ్మని పలికి నాఁటి కా గోష్ఠి చాలించెను.

అంత నేను లోలోన "నీ శుకజన్మమునుండి యే విధముగ నుద్ధరింపబడుదునా"యని చింతించుచుండ నింతలో

హారీతుఁడు వచ్చి "తమ్ముఁడా! వైశంపాయనా నీ భాగ్యము పండినది, నీ జనకుని వద్దనుండి ని న్నన్వేషించుచు కపింజలుఁ డిచ్చటికి వచ్చినాఁ" డని చెప్పెను.

అంతలోఁ గపింజలుఁ డచ్చటికి వచ్చి కన్నుల నీరు నించుచున్న నన్ను చేతులతో నెత్తుకొని వక్షంబున నుంచుకొని పామరునివలె విలపించెను. అప్పుడు నే నాతనిగాంచి "వయస్యా! కపింజలా! కూర్చుండుము. మా జనకుఁడు క్షేమముగా నున్నాడా? నాచరిత్రము వినినన్ను నిందించినాఁడా! నన్నెప్పుడైన స్మరించునా?" యని యడిగితిని. అంత కపింజలుఁడు "మిత్రుడా! మీ తండ్రియగు, శ్వేతకేతువు క్షేమముగా నున్నాఁడు. ఆ మహానుభావుం డీ వృత్తాంతమంతయు దివ్యదృష్టిచే దర్శించి తగిన ప్రతిక్రియకై ప్రయత్నించుచున్నాఁడు. నేను తురంగజన్మమునుండి విముక్తుఁడనై యమ్మహాముని యంతికమున కేగితిని. శ్వేతకేతువు నన్నుఁ జేరువ కుంజీరి గారవించుచు నిట్లనియె. "వత్సా! కపింజలా! వగవఁబోకుము. కొలఁది కాలములో నంతయు శుభాంతము కాగలదు."

అనిన నేను మహాత్మా! తమకు నా యందు దయగలిగిన-చో నా మిత్రుం డెందున్నాండో సెలవిండు. నే నాతని దర్శింప నువ్విళ్లూరు చున్నా" నని పలికిన నమ్మహాత్ముండు "వత్సా! వాండిప్పుడు శుకయోని జనించి జాబాలి మహర్షి యాశ్రమమందున్నాండు. కాన నీవిప్పు డచ్చటికిపోయి వాని దర్శించి, "కర్మము పరిపక్వమగు వఱకు నమ్మునీంద్రుని యాశ్రమము విడువవల" దని నా మాటలుగా వచింపుము." అని నన్నంపెను.



# పంచదశ విలాసము

ఇట్లు కపింజలుఁడు నాకు బోధించి నన్నటనుండి కదల నీయవలదని హారీతునకు బెక్కుమారులు నొక్కి చెప్పి మఱియొకమారు నన్ను గౌగలించుకొని వెడలిపోయెను.

అనంతరము హారీతుఁడునన్నారడించుచుసముచితాహారములచే నాకెట్టి కొఱంతయులేకుండఁ బోషించుచుండెను. కొన్ని దినములకు నాకు ఱెక్కలు వచ్చినవి. కొంచెముకొంచె మెగురుటకుసామర్థ్యముకలిగినది. అంత నేను బాల్యాచాపల్యముచే మహాశ్వేత యొద్దకుఁ బోవ నిశ్చయించి యొకానొక ప్రభాతంబున నెగిరి యుత్తర దిశగా నరిగితిని.

కొంచెము దూరమేగితినో లేదో నా కాయాస మధికమయ్యెను. ముందుకుపోలేక వెనుకకురాలేక నిట్టూర్చుచు నొక్కచెట్టుపై వ్రాలి నిద్రించితిని. మేల్కాంచి చూచితినిగదా! వలలో బంధింపఁబడియుంటిని. నా ముందొక భయంకరాకారుఁడగు పురుషుఁడు నిలబడి యుండెను. నేనాతని గాంచి "నీ వెవ్వఁడవు? నన్నేల బంధించితి" వని యడుగ వాఁడిట్లు పలికెను. నేనొక మాతంగుఁడను. ఇచ్చటి కనతిదూరమున మాప్రభువు

గలఁడు. ఆతనికొక కూతురుకలదు. ఆమెకెవ్వరో జాబాలి యాశ్రమమున చిత్రమైన చిలుకగలదని చెప్పినారట. అందులకై యామె కుతూహలముతో నిన్ను బట్టుకొని వచ్చుటకు మమ్ము చాలమందిని బంపినది. నా యదృష్ట వశముచే నీవు నా చేతికిఁ జిక్కితివి."

అనంతర మా మాతంగుఁడు నే నెంతబ్రతిమాలినను నా ప్రార్థన మాలింపక నన్ను బట్టుకొని పోయి తన ప్రభుపుత్రిక కప్పగించెను. ఆ మాతంగ కుమారియు వానిని మిక్కిలి మెచ్చుకొని నన్ను హస్తమునఁ గ్రహించి "పుత్రకా! చేతికిఁజిక్కితివి. ఇప్పుడెక్కడికిఁ బోయెద"వని నన్నొక్క కొయ్యబంజరములోఁ బెట్టి బంధించినది" అంత నేను నా దురదృష్టంబునకు నెంతయు చింతింతిని.

దివ్యలోకపతనము, మర్త్యలోక, జననము తిర్యగ్జాతి సంభవము, మాతంగ హస్తోపగమము, పంజర బంధము మొదలగున వన్నియు నా యింద్రియచాపల్యమునకు ఫల ములే గదాయని పెక్కువిధముల విచారించితిని.

ఒకనాఁడు నిదుర మేల్కొని చూడఁగా నీ బంగారు పంజరమున నుంటిని. అందుల కచ్చెరు వందుచుండ మాతంగకన్య నన్ను ప్రభువులవారి పాదసన్నిధికిఁ గొని వచ్చినది.

అని వైశంపాయనము వచింప శూద్రకరాజేంద్రుఁడు ప్రతీహారింబిలిచి మాతంగకన్యను గొనిరమ్మని యాజ్ఞాపించెను. అప్పుడా మాతంగకన్య మహారాజు సన్నిధికి వచ్చి యిట్లు పలికెను.

"భువనభూషణా ! రోహిణీరమణా ! కాదంబరలోచనానందచంద్రా ! వీఁడు మీ యిరువుర జన్మవృత్తాంతము వచింపవింటివిగదా ! జాబాలియాశ్రమము విడువవలదని తండ్రిగారు ప్రబోధించినను వీఁడు కామాంధుడై మహాశ్వేత యొద్దకుఁ బ్రయాణమగుటయు మీరెఱింగితిరి. నేను వీని తల్లినగు లక్ష్మినని వీఁడు తన యాజ్ఞ మీఱివెడలుట శ్వేతకేతు మహాముని దివ్యదృష్టిం దెలిసికొని నన్ను బిలిచి నీ కుమారుఁడింకను నధఃపతితుఁడగునని తోఁచుచున్నది. నీవుపోయి కర్మపరిపక్వమగువఱకు వానినొక్కచోటఁ గట్టిపెట్టి యుంచుమని నన్నంపెను. నేనువచ్చి యిట్లు నటించితిని.

"శూద్రకరాజేంద్రా! వినుము నీవు చంద్రాపీడుడవు ! వీఁ.. నీ మిత్రుఁడగు వైశంపాయనుఁడు. మీకు శాపావసా..మైనది. ఈ శరీరంబులు త్యజించి యిష్టజనసమా..మ సౌఖ్యమనుభవింపుడు.

“అని పలికి యా మాతంగకన్య యందలి వారెల్ల యాశ్చర్యమున నవలోకించుచుండ నాకాశమున కెగిరి యదృశ్యమైనది.



# షోడశ విలాసము

వసంతకాలము వచ్చినది. రసాలములు పల్లవించినవి. కలకంఠగానములు కర్ణపర్వములైనవి. భ్రమర ఝుంకారములు ప్రవర్తిల్లినవి. ప్రకృతియంతయు రాగమయమై, యనురాగమయమై, రసమయమైనది.

అప్పుడు కాదంబరి సరోవరమున స్నానమొనర్చి సుందర సుగంధ కుసుమ మాల్యాదులతో చంద్రాపీడుని శరీరము నర్చించినది. తెప్ప వేయక ప్రేమార్ద్రములగు వీక్షణములతో ప్రాణేశ్వరు దేహమును దర్శించి గాఢాలింగనము గావించుకొనినది.

పవిత్రమగు నామె యాశ్లేషముచే చంద్రాపీడుని శరీరములోఁ బ్రాణశక్తి ప్రవహించినది. హృదయము స్పందించినది. శ్వాసము ప్రవర్తిల్లినది. నయనములు స్మిలితములైనవి. చంద్రాపీడుఁడు నిద్రమేల్కొన్నట్లు లేచి కన్నులు మూసికొని భీతిచే వడంకుచున్న కాదంబరితో నిట్లనెను. "దేవీ! భయపడకుము. అమృతకిరణ సంభవమగు నప్సరల కులంబున జన్మించిన నీ కంఠగ్రహణముచే నేను సజీవుడనైతిని. శూద్రక శరీరమును త్యజించితిని. మరియు నీ నెచ్చెలియగు మహాశ్వేతకు మనోహరు

డైన పుండరీకుడు గూడ నాతోఁబాటు శాపవిముక్తుడయ్యెనని పల్కుచుండగనే శుకశరీరమును విడిచిన పుండరీకుడు పూర్వముమాడ్కి కంఠంబున నేకావళి ధరించి కపింజలుని కైదండగొని యచ్చోటికివిచ్చేసెను

దూరమునందే వాని రాక గాంచి కాదంబరి మహాశ్వేతయొద్దకు బరువెత్తి తదాగమనవృత్తాంతము నెఱింగించెను. పుండరీకచంద్రాపీడులిరువురు పరస్పరము గాఢాలింగనము గావించుకొనిరి. ఆశుభవర్తమానము గంధర్వరాజులకుదెలుప కేయూరకుడు హేమకూటమునకు బరువిడెను. మదలేఖయు సత్వరగమనమునబోయి యాప్రాంతమున జపము జేసికొనుచున్న తారాపీడుని చరణములపైఁబడి యువరాజు వైశంపాయనునితోగూడజీవించినాడని యెఱింగించెను.

ఆ మాట విని తారాపీడుఁడు పరమానందభరితుఁడై మనోరమా శుకనాసులతో నచ్చటికి వచ్చి కుమారుని గౌగిలించుకొనెను. చంద్రాపీడుఁడు శుకనాసునకు నమస్కరించి వీఁడే వైశంపాయనుండు చూడుడని పుండరీకుని జూపించెను. అప్పుడు కపింజలుడు శుకనాసుని గాంచి "ఆర్యా! శ్వేతకేతుడు మీ కిట్లు చెప్పుమని సన్నంపినాడు:- ఈపుండరీకుని నేను పెంచితిని. కాని నీకు వీఁడు తనయుడై జన్మించెను. వీని యనురాగమంతయు

మీాయందే కలదు. కావున వీనిని వైశంపాయను డనియే భావింపుడు. పరుడని యుపేక్షింపకుడు." శుకనాసుఁ డామాటలువిని వినయావనతముఖుడైన పుండరీకుని జేర దీసి గారవించెను. తల్లులిరువురు తమతమ కుమారులను గాగిలించుకొని సంతోష సరసి లోమునకలిడిరి .

మఱునా డుదయమున మదిరాచిత్రరథులును, గౌరీ హంసులును సమస్తగంధర్వ సమూహములతో నచ్చో టికి వచ్చి కుమార్తెలను అల్లుండ్రనుగాంచి యానం దించెను.

చిత్రరథు డుసమస్తగంధర్వరాజ్యముతో కాదంబరిని చంద్రాపీడునకిచ్చి కల్యాణముగావించెను. హంసుండును అట్లే మహాశ్వేతను పుండరీకున కిచ్చి వివాహము చేసెను. చంద్రాపీడపుండరీకులు కాదంబరీ మహాశ్వేత లతో గూడి మహానంద సాగరమున నోలలాడిరి.

ఒకనాఁడు కాదంబరి చంద్రాపీడునితో నిట్లనెను. "ఆర్యపుత్రా! మన మందఱమును మరణించి మరల బ్రతికితిమి. అందఱము గలిసికొంటిమి గాని పత్రలేఖ మాత్రము సరస్సునుండి తిరిగిరాలేదు."

అనిన విని చంద్రాపీడుఁడు "దేవీ! నాభార్యయగు రోహిణియే యా పత్రలేఖ. నేను శాపవశమున భూలో